# DHANANJAYA NIGHANTU

WITH

TELUGU NOTES & INDEX.




V. RAMASWAMY SASTRULU & SONS

192, ESPLANADE, MADRAS.

1917.





C. M. Veerabhadrayar Student

శ్రీరస్తు.

# ధనంజయనిఘంటువు.

ఆంధ్రటీకాసహితము.

చెన్నపురి:
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే
ప్రకటితము.
1917.

# పీఠిక.

సంస్కృతభాషయందు పాండిత్యము సంపాదింపఁ గోరువారికి ఈ ''ధనంజయనిఘంటువు'' మిక్కిలి యుపయోగకారియై యున్నది. దీనియందు కేవలము రూఢశబ్దములే గాక, పదయోజనప్రక్రియ కనువగు పర్యాయపదనిరూపణమును దెలియఁజేయంబడియున్నది. కాఁబట్టి, ఈనిఘంటువు త్రికాండమునకంటె విలక్షణమైనదియై, శబ్దజాలంబును సమయానుసారంబుగ యోజించుకొనుటకు సాధకమైనదియైయున్నది.

మఱియు నిది సంస్కృతభాషాభిజ్ఞులకుమాత్రమే గాక, ఆంధ్రభాషాభిజ్ఞులకుఁగూడ నుపయుక్తమగువిధంబున నాంధ్రటీకయు ఉదాహరణములును జేర్చి ముద్రించినారము.

ఈనిఘంటుకర్తయగు ధనంజయకవి, త్రికాండకర్తయగు అమరసింహునికంటె పూర్వుఁడనికొంద ఱనెదరు. ఇతఁడు ''ద్విసంధాన''మను కావ్యరత్నమును రచియించి యున్నట్లీగ్రంథముచేతనే తెలియుచున్నది. త్రికాండగ్రంథకర్త బౌద్ధుఁడు. ఈనిఘంటుకర్త జైనుఁడు. ఇతఁడు జైనమతస్థుఁడని యీనిఘంటువును పఠించిన వేద్యమగును.

చెన్నపురి. }
2-11-1917. }

ఇట్లు,
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.



# ధనంజయనిఘంటువు.

## ప్రథమ పరిచ్ఛేదము.

### (సంకీర్ణ పరిచ్ఛేదము).



---

మూలం. తన్నమామి పరంజ్యోతి రవాఙ్మానసగోచరమ్,
ఉన్మూలయత్యవిద్యాం య ద్విద్యా మున్మీలయత్యపి. ౧.

టీక. యత్=ఏతేజము, అవిద్యాం=అజ్ఞానమును, ఉన్మూలయతి = నాశముచేయుచున్నదో, అపి=మఱియు, విద్యాం=జ్ఞానమును, ఉన్మీలయతి=అభివృద్ధిచేయుచున్నదో, తత్=అటువంటి, అవాఙ్మానసగోచరం=వాక్కునకును, మనస్సునకును విషయము కానట్టి, పరం=ఉత్కృష్టమైన, జ్యోతిః=తేజమును (=పరమాత్మనుగూర్చి) నమామి=నమస్కరించుచున్నాఁడను.

మూ. ద్వయం ద్వితయ ముభయం యమళం యుగళం యుగం,
యుగ్మం ద్వంద్వం యమం ద్వైతం పాదయోః పాతు జైనయోః.

టీ. ద్వయం, ద్వితయం, ఉభయం, యమళం, యుగళం, యుగం, యుగ్మం, ద్వంద్వం, యమం, ద్వైతం, ఈపదములు ౧౦=పదియు, జైనయోః=జినదేవసంబంధములైన, పాదయోః = చరణములయొక్క జంటను వాచకమై, (మమ్ము) పాతు=రక్షించునుగాక.

మూ. ఋషి ర్యతి ర్ముని ర్మోక్షు స్తాపస స్సంశితో వ్రతీ,
తపస్వీ సంయమీ యోగీ వర్ణీ సాధుశ్చ పాతు నః. 3.

టీ. ఋషిః, యతిః, మునిః, మోక్షుః, తాపసః, సంశ్రితః, వ్రతీ, తపస్వీ, సంయమీ, యోగీ, వర్ణీ, సాధుః, ఈ ౧౨ పదములకును వాచకమయిన ఋషిశబ్దవాచ్యుఁడు, నః=మమ్ము, పాతు=రక్షించును గాక.

మూ. దీక్షితం మాఖ శిష్యౌచ త మంతేవాసినం విదుః,
కృతాంతాగమసిద్ధాంతగ్రంథాశ్శాస్త్రమతఃపరం. ౪

టీ. తం=ప్రసిద్ధుఁడైన, అంతేవాసినం = గురువుయొక్క సాన్నిధ్యమున (విద్యావ్యాసంగములనుజేయుచు) వసించువానిని, దీక్షితం=దీక్షితుఁడనియును, మాఖశిష్యౌచ=మాఖుఁడనియును శిష్యుఁడనియును, విదుః=చెప్పుదురు. (అనఁగా విద్యార్థికి దీక్షితః, మాఖః, శిష్యః. అని 3 పేళ్లు.)

కృతాంతాగమసిద్ధాంతగ్రంథాః=కృతాంతః; ఆగమః, సిద్ధాంతః, గ్రంథః అను నీ ౪ శబ్దములు మతగ్రంథములకు పేళ్లు.

అతః=ఈమతగ్రంథములకు, పరం=వ్యతిరిక్తమైనది,శాస్త్రం=శాస్త్రమనిపించుకొనును.

మూ. భూమి ర్భూః పృథివీ పృథ్వీ గహ్వరీ మేదినీ మహీ,
ధరా వసుంధరా ధాత్రీ క్షమా విశ్వంభరాఽవనిః. ౫
వసుధా ధరణీ క్షోణీ క్ష్మా ధరిత్రీ క్షితిశ్చ కుః,
కుంభినీళోర్వరోర్వీగౌ ర్జగతీ వసుమత్యపి. ౬

టీ. భూమిః, భూః, పృథివీ, పృథ్వీ, గహ్వరీ, మేదినీ, మహీ, ధరా, వసుంధరా, ధాత్రీ, క్షమా, విశ్వంభరా, అవనిః, వసుధా, ధరణీ, క్షోణీ, క్ష్మా, ధరిత్రీ, క్షితిః, కుః, కుంభినీ, ఇళా,ఉర్వరా, ఉర్వీ, గౌః, జగతీ, వసుమతీ, ఈ ౨౭ను భూమిపేళ్లు.

మూ. తత్పర్యాయధర శ్శైల స్తత్పర్యాయపతి ర్నృపః,
తత్పర్యాయరుహో వృక్ష శ్శబ్ద మన్యంచ యోజయేత్. ౭

టీ. తత్పర్యాయధరః = ఆభూమియొక్క పర్యాయనామములతోఁ జేరినధరశబ్దము, శైలః=పర్వతవాచకమగును. ఉదాహరణము - భూమిధరః, భూధరః, పృథివీధరః, ఇత్యాదులు.

తత్పర్యాయపతిః=భూమిపర్యాయనామములతోఁ జేరిన పతిశబ్దము,నృపః= రాజు పేరగును. ఉదా- భూమిపతిః, పృథివీపతిః, ఇత్యాదులు.

తత్పర్యాయరుహః = ఆభూమిపర్యాయనామములతోఁ జేరినరుహశబ్దము. వృక్షః=చెట్టుపేరగును.ఉదా-భూమిరుహః, భూరుహః,మహీరుహః, ఇత్యాదులు.

అన్యం=ఇతరమైన,శబ్దంచ=పదమును, యోజయేత్=చేర్చవచ్చును. ఎట్లనఁగా, భూపర్యాయశబ్దముతో, ధరః, భృత్, ఇత్యాది ధరపర్యాయశబ్దములుచేరి పర్వత మునకును; ధవః, భర్తా, ఇత్యాది పతిపర్యాయపదములు చేరి రాజునకును; భవః, జః, ఇత్యాది రుహాశబ్దపర్యాయములుచేరి వృక్షమునకును పేళ్లౌను.

మూ. దరీభృ దచల శ్శృంగీ పర్వత స్సానుమా న్గిరిః,
నగ శ్శిలోచ్చయో౽ద్రిశ్చ శిఖరీ త్రికకు న్మరుః. ౮

టీ. దరీభృత్, అచలః, శృంగీ, పర్వతః, సానుమాన్, గిరిః, నగః, శిలోచ్చయః, అద్రిః, శిఖరీ, త్రికకుత్, మరుః, ఈ ౧౨ ను కొండకు పేళ్లు.

మూ. ప్రస్థః పార్శ్వం తటం సాను ర్మేఖలోపత్యకా తటీ,
నితంబ అంతోపాంతౌ చ తద్వానపి గిరి స్మృతః. ౯

టీ. ప్రస్థః, పార్శ్వం, తటం, సానుః, మేఖలా, ఉపత్యకా, తటీ,నితంబః, అంతః, ఉపాంతః, ఈ ౧౨ ను కొండలయొక్క ప్రక్కలకు పేళ్లు.

తద్వానపి=అప్రస్థాదిశబ్దములపై (కల అను అర్థమునిచ్చు) వతిప్రత్యయపర్యాయములను చేర్చిన యెడల, గిరిః=కొండకుపేరగునని, స్మృతః=తలంపఁబడెను. ఉదా—సానుమాన్,తటవాన్,తటీవాన్,పార్శ్వవాన్, ఉపత్యకావాన్, ప్రస్థీ, మేఖలీ, ఇత్యాదులు.

మూ. రాజా౽ధిపః పతి స్స్వామీ నాథః పరివృఢః ప్రభుః,
ఈశ్వరో విభు రీశానో భర్తేంద్ర ఇన ఈశితా. ౧౦

టీ. రాజా, అధిపః, పతిః, స్వామీ, నాథః, పరివృఢః, ప్రభుః, ఈశ్వరః. విభుః, ఈశానః, భర్తా, ఇంద్రః, ఇనః, ఈశితా, ఈ ౧౪ ను రాజుపేళ్లు.

మూ. అనోకహ స్తరు శ్శాఖీ విటపీ ఫలినో నగః,
ద్రుమో౽ంఘ్రిపః ఫలేగ్రాహీ పాదపో౽గో వనస్పతిః. ౧౧

టీ. అనోకహః, తరుః, శాఖీ, విటపీ, ఫలినః, నగః, ద్రుమః, అంఘ్రిపః, ఫలేగ్రాహీ, పాదపః, అగః, వనస్పతిః, ఈ ౧౨ నుమ్రానిపేళ్లు.

మూ. తత్పర్యాయచగో జ్ఞేయో హరి ర్వలిముఖః కపిః,
వానరః ప్లవగః కీశో గోలాంగూలో౽థ మర్కటః. ౧౨

టీ. తత్పర్యాయచరః=అవృక్షపర్యాయనామములతోఁ జేరిన చరశబ్దము (అనఁగా తరుచరః, నగచరః, ద్రుమచరః, ఇత్యాది పదములును,) మఱియు, హరిః, వలిముఖః, కపిః, వానరః, ప్లవగః, కీశః, గోలాంగూలః, మర్కటః, ఈ౧౦ పేళ్లును కోతికిఁ బేళ్లని, జ్ఞేయః=తెలియఁ దగినది.

మూ. విపినం గహనం కక్ష మరణ్యం కాననం వనం,
కాంతార మటవీ దుర్గం తచ్చర స్స్యా ద్వనేచరః. ౧౩

టీ. విపినం, గహనం, కక్షం, అరణ్యం, కాననం, వనం, కాంతారం, అటవీ, దుర్గం ఈ ౯ యు అడవికిపేళ్లు.

తచ్చరః=ఆ యడవిపర్యాయశబ్దములలోఁ జేరిన చరశబ్దము, వనేచరః=బోయవానికి పేరు, స్యాత్ = అగును. ఉదా-వనచరః, అరణ్యచరః, ఇత్యాదులు.

మూ. పుళింద శ్శబరో దస్యు ర్నిశాటో వ్యాధ లుబ్ధకౌ,
ధానుష్కోఽథ కిరాతశ్చ సోఽరణ్యానీచర స్స్మృతః. ౧౪

టీ. పుళిందః, శబరః, దస్యుః, నిశాటః, వ్యాధః, లుబ్ధకః, ధానుష్కః, కిరాతః, ఈ ౮ పేళ్లకు శబ్దవాచ్యుఁడైన, సః=వాఁడు, అరణ్యానీచరః=అడవియందు తిరుగుచుండునట్టి, బోయ, చెంచు, ఏనాదిజాతులలో నొకఁడని, స్మృతః=తలంపఁబడెను.

మూ. వా ర్వారి జల మమ్భోఽమ్బు క మర్ణ స్సలిలం పయః,
శరం వనం కుశం తోయం నీరం జీవన మబ్విషమ్. ౧౫

టీ. వాః, వారి, జలం, అంభః, అంబు, కం, అర్ణం, సలిలం, పయః, శరం, వనం, కుశం, తోయం, నీరం, జీవనం, అప్, విషం, ఈ ౧౭ ను నీళ్లకుపేరు.

మూ. తత్పర్యాయచరో మత్స్య స్తత్పర్యాయప్రదో ఘనః,
తత్పర్యాయోద్భవం పద్మం తత్పర్యాయధి రంబుధిః. ౧౬

టీ. తత్పర్యాయచరః=ఆ ఉదయపర్యాయనామములతోఁ జేరిన చరశబ్దము,మత్స్యః=చేపలకు పేరు. ఉదా—వారిచరః, జలచరః, అంబుచరః, ఇత్యాదులు.

తత్పర్యాయప్రదః = ఆ ఉదకపర్యాయనామములతోఁ జేరిన, ప్రదః = ఇచ్చు

న నెడిపర్యాయనామము, ఘనః=మేఘమునకు పేరౌను. ఉదా-వారిప్రదః, జల ప్రదః,శరదః, తోయదః, జలముక్, అబ్దః, ఇత్యాదులు.

తత్పర్యాయోద్భవం = ఆ ఉదకపర్యాయనామములతోఁ జేరిన, ఉద్భవం= పుట్టినది యనెడి పర్యాయనామము, పద్మం=తామరపేళ్లగును ఉదా - జలోద్భవం, జలరుహం, జలజం, ఇత్యాదులు.

తత్పర్యాయధిః=ఆఉదకపర్యాయనామములతోఁగూడిన,ధి శబ్దము అంబుధిః= సముద్రమునకు పేరగుచున్నది. ఉదా - అంబుధిః, తోయధిః ఇత్యాదులు.

మూ. యాదో ఝషః పదక్షీణ శ్శఫరోఽనిమిష స్తిమిః,
వైసారిణో విసారశ్చ మీనః పాఠీన ఏవ చ. ౧౭

టీ. యాదః, ఝషః, పదక్షీణః, శఫరః, అనిమిషః, తిమిః, వైసారిణః, విసారః, మీనః, పాఠీనః, ఈ ౧౦ యు చేపలకు పేర్లు.

మూ. ఘనాఘనో ఘనో మేఘో జీమూతోఽభ్రం వలాహకః,
పర్జన్యో ముదిరోఽనభ్రా ట్తటి త్సౌదామినీపతిః. ౧౮

టీ. ఘనాఘనః, ఘనః,మేఘః, జీమూతః, అభ్రః, వలాహకః, పర్జన్యః, ముదిరః, అనభ్రాట్, తటిత్పతిః, సౌదామినీపతిః, ఈ ౧౧ ను మేఘమునకు పేర్లు.

మూ. ఆకాలికీ క్షణరుచి ర్విద్యు త్తత్పతి రంబుదః,

టీ. ఆకాలికీ, క్షణరుచిః, విద్యుత్, ఈ 3 ను మెఱుపు పేర్లు.
తత్పతిః=ఈమెఱుపు పర్యాయనామముతోఁ జేరిన పతిపర్యాయశబ్దము, అంబుదః=మేఘముఅగును. ఉదా- విద్యుత్పతిః, ఆకాలికీపతిః, తటిత్పతిః, ఇట్లు, తటిత్వాన్, ఇత్యాదులును.

మూ. నిర్ఘాత మశని ర్వజ్ర ముల్కా_శబ్దంచ వర్జయేత్. ౧౯

టీ. నిర్ఘాతం, అశనిః, వజ్రం, ఈమూఁడు శబ్దములను, ఉల్కా_శబ్దంచ = ఉల్కా_శబ్దమును, వర్జయేత్ = విడువవలయును. (అనఁగా నిర్ఘాతాది నాలుగుశబ్దములను పతిశబ్దముతోఁ జేర్చి మేఘమని చెప్పరాదనుట.)

మూ. కమలం నళినం పద్మం సరోజం సరసీరుహం,
కరదండం కోకనదం పుండరీకం మహోత్పలం. ౨౦
ఇందీవరం చారవిందం శతపత్త్రఞ్చ పుష్కరమ్.

టీ. కమలం, నళినం, పద్మం, సరోజం, సరసీరుహం, కరదండం, కోకనదం, పుండరీకం, మహోత్పలం, ఇందీవరం, అరవిందం, శతపత్త్రం, పుష్కరం, ఈ ౧౩ను తామరపేళ్లు.

మూ. సౌగంధికం తు కహ్లారం స్యా దిందీవర ముత్పలం. ౨౧
నీలోత్పలం కువలయం కైరవం కుముదం విదుః,

టీ. సౌగంధికం=సౌగంధికశబ్దము, కహ్లారం=కొంచెము ఎఱుపును తెలుపునుకల్గి బహు పరిమళముగల కమలమునకు పేరగును.
ఇందీవరం=ఇందీవరశబ్దము, ఉత్పలం=నల్లకలువనుపేరు. కైరవం = కైరవశబ్దము, కుముదం=తెల్లకలువపేరని, విదుః= తెలిసికొనెదరు.

మూ. పరిష త్కర్దమః పంకం తజ్జం తామరసం విదుః. ౨౨

టీ. పరిషత్, కర్దమః, పంకం, ఈ 3-ను ఆడుసుపేళ్లు.
తామరసం=తామరను, తజ్జం=ఆయడుసునందుఁ బుట్టినదిగా, విదుః= (తెలిసికొనెదరు) చెప్పెదరు.
ఉదా:—పంకజం, పంకజాతం, పంకోద్భవం, పంకేరుహం, కర్దమజన్మ, కర్దమప్రభవం, పరిషద్భవం, పరిషజ్జాతం, ఇత్యాదులు.

మూ. తద్వతీ బిసినీ జ్ఞేయా వ్రతతీ వల్లరీ లతా,
వల్లీనామాని యోజ్యాని వారిధి ర్వర్ణ్య తేఽధునా. ౨౩

టీ. బిసినీ=తామరతీఁగె, తద్వతీ = ఆకమలములుగలదిగా, జ్ఞేయా = తెలియఁదగినది. (అనగా కమలినీ, పద్మినీ, పంకజినీ, సరోజినీ, ఇత్యాదులు తామరతీఁగెల పేళ్లనుట)
వ్రతతీ, వల్లరీ, లతా, ఈ 3-పేళ్లను, వల్లీనామాని=తీఁగెలపేళ్లుగా, యోజ్యాని=చేర్పఁదగినవి. అధునా=ఇప్పుడు, వారిధిః=సముద్రము, వర్ణ్యతే=మీఁద వివరింపఁబడుచున్నది.

మూ. స్రోతస్వినీ ధునీ సింధు స్స్రవంతీ నిమ్నగాఽఽపగా,
నదీ నదో ద్విరేఫశ్చ సరిన్నామ తరంగిణీ. ౨౮

టీ. స్రోతస్వినీ, ధునీ, సింధుః, స్రవంతీ, నిమ్నగా, ఆపగా, నదీ, నదః, ద్విరేఫః, తరంగిణీ, ఈ ౧౦.యు సరిన్నామ=నదికి పేళ్లు.

మూ. తత్పతిశ్చ భవత్యబ్ధిః పారావారోఽమృతోద్భవః,
అపారపారః కూపారో రత్నమీనాభిధాకరః. ౨౯
అకూపార స్సముద్రశ్చ సరస్వా న్సాగరోఽర్ణవః,

టీ. తత్పతిశ్చ=ఆనదీపర్యాయనామములతోఁ జేరిన పతిశబ్దము, అబ్ధిః = సముద్రవాచకము, భవతి=అగుచున్నది.

(అనగా:—నదీపతిః,ధునీపతిః, నిమ్నగాపతిః, ఆపగాపతిః, ఇత్యాదులును;) పారావారః, అమృతోద్భవః, అపారపారః, కూపారః, రత్నమీనాభిధాకరః, రత్న=రత్నములయొక్కయు, మీన=మత్స్యములయొక్కయు, అభిధా=పర్యాయ నామములతోఁ జేరిన, ఆకరః = ఆకరశబ్దము, అనఁగా—రత్నాకరః,మీనాకరః, ఇత్యాదులును; అకూపారః, సముద్రః, సరస్వాన్, సాగరః, అర్ణవః, ఇవియును సముద్రమునకు పేళ్లు.

మూ. సీమోపకంఠం తీరం చ పారం రోధోఽవధి స్తటమ్. ౩౦

టీ. సీమా, ఉపకంఠం, తీరం, పారం, రోధః, అవధిః, తటం, ఈ ౭-ను సముద్రము, నది, బావి, చెఱువు, వీనియొక్క గట్టునకు పేర్లు.

మూ. భంగ స్తరంగః కల్లోలో వీచి రుత్కలికావళిః,
పాళీ వేళా తటోచ్ఛ్వాసో విభ్రమోఽయ ముదన్వతః. ౩౧

టీ. భంగః, తరంగః, కల్లోలః, వీచిః, ఈ ౪-ను గొప్ప అలలపేర్లు.
ఉత్కలికా, ఆవళిః, పాళీ, ఈ 3-ను చిన్నఅలలపేర్లు.
వేళా, తటః, ఈ ౨-ను సముద్రపుఁగట్ట (చెలియలికట్ట) పేర్లు.
ఉచ్ఛ్వాసః=ఉచ్ఛ్వాసమనెడి, అయం = ఈశబ్దము, ఉదన్వతః = సముద్రము యొక్క, విభ్రమః=విలాస మగును. అనఁగా:—సముద్రజలము ఉప్పొంగుటకు పేరు.(ఇది[illegible] అనఁబడును.)

మూ. మనుష్యో మానుషో మర్త్యో మానవో మనుజో నరః,
నా పుమాన్ పురుషో గోధో భవే త్తత్పతి రీశ్వరః. ౨౮

టీ. మనుష్యః, మానుషః, మర్త్యః, మానవః, మనుజః, నరః, నా, పుమాన్, పురుషః, గోధః, ఈ ౧౦-యు మనుష్యులపేర్లు.

తత్పతిః = ఆమనుష్యపర్యాయనామములతోఁ జేరినపతిశబ్దము, ఈశ్వరః=రాజు పేర్లుగా, భవేత్=అగును.

ఉదా:—నరపతిః, నృపతిః, మర్త్యనాథః, మానవేశః, మనుజాధిపః, మనుష్యాధిపః, ఇత్యాదులు.

మూ. భృత్యోఽథ భృతకః పత్తిః పదాతిః పదగోఽనుగః,
భటోఽనుజీవ్యనుచర శ్శస్త్రజీవీ చ కింకరః. ౨౯

టీ. భృత్యః, భృతకః, పత్తిః, పదాతిః, పదగః; అనుగః, భట్టః, అనుజీవీ, అనుచరః, శస్త్రజీవీ, కింకరః, ఈ ౧౧ - సేవకుని పేర్లు.

మూ. స్త్రీ నారీ వనితా ముఖ్యా భామినీ భీరు రంగనా,
లలనా కామినీ యోషి ద్యోషా సీమంతినీ వధూః. ౩౦
నితంబి న్యబలా బాలా కాముకీ వామలోచనా,
భామా తలోదరీ రామా సుందరీ యువతి శ్చలా. ౩౧

టీ. స్త్రీ, నారీ, వనితా, ముఖ్యా, భామినీ, భీరుః, అంగనా, లలనా, కామినీ, యోషిత్, యోషా, సీమంతినీ, వధూః, నితంబినీ, అబలా, బాలా, కాముకీ, వామలోచనా, భామా, తలోదరీ, రామా, సుందరీ, యువతిః, చలా, ఈ ౨౪ను ఆఁడుదానిపేర్లు.

మూ. భార్యా జాయా జనీ కుల్యా కళత్రం గేహినీ గృహం,
మహిళా మానినీ పత్నీ తథా దారాః పురంధ్రికా. ౩౨

టీ. భార్యా, జాయా, జనీ, కుల్యా, కళత్రం, గేహినీ, గృహం, మహిళా, మానినీ, పత్నీ, దారాః, పురంధ్రికా (పురంధ్రీ) ఈ ౧౨ను పెండ్లముపేర్లు.

మూ. వల్లభా ప్రేయసీ ప్రేష్ఠా రమణీ దయితా ప్రియా,
ఇష్టాచ ప్రమదా కాంతాఽచండీ ప్రణయినీ తథా. 33

టీ. వల్లభా, ప్రేయసీ, ప్రేష్ఠా, రమణీ, దయితా, ప్రియా, ఇష్టా, ప్రమదా, కాంతా, అచండీ, ప్రణయినీ, ఈ ౧౧-ను ప్రియురాలైన పెండ్లాము పేర్లు.

మూ. సతీ పతివ్రతా సాధ్వీ పతివత్న్యేకపత్న్యపి,
మనస్వినీ భవ త్యార్యా విపరీతా నిరూప్యతే. 3౪

టీ. సతీ, పతివ్రతా, సాధ్వీ, పతివత్నీ, ఏకపత్నీ, మనస్వినీ, ఈ ౬ ను, ఆర్యా=పూజ్యురాలైన పతివ్రతాస్త్రీ), భవతి = అగుచున్నది. (అనగా ఈ౬ను పతివ్రతాస్త్రీ పేర్లు)

విపరీతా=ఈపతివ్రతకు వ్యతిరిక్తయైనది; (అనఁగా వ్యభిచారణిస్త్రీ) నిరూప్యతే=చెప్పఁబడుచున్నది.

మూ. బంధకీ కులటా ముక్తా పునర్భూః పుంశ్చలీ ఖలా,
స్వశాఽభిసారికా దూతీ స్వైరిణీ శంభళీ తథా. 3౫

టీ. బంధకీ, కులటా, ముక్తా, పునర్భూః, పుంశ్చలీ, ఖలా, స్వశా, అభిసారికా, దూతీ, స్వైరిణీ, శంభళీ, ఈ ౧౧ - ను రంకులాడి పేర్లు.

మూ. గణికాఽలజ్జికా వేశ్యా రూపాజీవా విలాసినీ,
పణ్యస్త్రీ దాసికా దాసీ కాముకీ సర్వవల్లభా 3౬

టీ. గణికా, అలజ్జికా, వేశ్యా, రూపాజీవా, విలాసినీ, పణ్యస్త్రీ, దాసికా, దాసీ, కాముకీ, సర్వవల్లభా, ఈ ౧౦- యు లంజె పేర్లు.

మూ. కాంతేష్టౌ దయితః ప్రీతః ప్రియః కామీ చ కాముకః,
వల్లభోఽథ పతిః ప్రేయా న్విటశ్చ రమణో ధవః. 3౭

టీ. కాంతః, ఇష్టః, దయితః, ప్రీతః, ప్రియః, కామీ, కాముకః, వల్లభః, పతిః, ప్రేయాన్, విటః, రమణః, ధవః, ఈ ౧౩ - ను మగని పేర్లు.

మూ. సవిత్రీ జననీ మాతా జనక స్సవితా పితా,

టీ. సవిత్రీ, జననీ, మాతా, ఈ 3 ను కన్నతల్లి పేర్లు.
జనకః, సవితా, పితా, ఈ 3 - ను కన్నతండ్రి పేర్లు.

మూ. దేహోఽపఘన కాయాంగం వపు స్సంహననం తనుః 3౮
కళేబరం శరీరం చ మూర్తి రస్మిన్ భవ స్సుతః,
పుత్త్ర స్సూను రపత్యంచ తుక్తోకం చాత్మజః ప్రజః. 3౯
ఉద్వహ స్తనయః పోతో దారకో నందనోఽర్భకః.
స్తనంధయోత్తానశయౌ స్త్రీత్వే దుహితరం విదుః. ౪౦

టీ. దేహః, అపఘనః, కాయః, అంగం, వపుః, సంహననం, తనుః, కళేబరం, శరీరం, మూర్తిః, ఈ౧౦ - యు శరీరమునకు పేళ్ళు.
అస్మిన్ = ఈశరీరపర్యాయనామములలోఁ జేరిన, భవః = ఉత్పత్తిపర్యాయ నామము, అనఁగా:—కాయభవః, శరీరభవః, ఇట్లు:—కాయజః, తనూజః, ఇత్యాదులును;
సుతః, పుత్త్రః, సూనుః, అపత్యం, తుక్తోకం, ఆత్మజః, ఉద్వహః, తనయః, పోతః, దారకః, నందనః, అర్భకః, స్తనంధయః, ఉత్తానశయః, ఈ ౧౫ ను కొడుకు పేళ్ళు.
ఈ కాయభవాదిశబ్దములు స్త్రీలింగమైనప్పుడు దుహితరం=కూమార్తెను గా, విదుః=తెలియుదురు. ఉదా.—కాయభవా, శరీరభవా, అంగజా, తనుజా, పుత్త్రీ, సుతా, ఆత్మజా, ప్రజా, నందినీ, తనయా, ఇత్యాదులు.

మూ. వయస్యాఽఽళీ సహచరీ సధ్రీచీ సవయా స్సఖీ,
ఆళీవివర్జితం సంఘు మధో మిత్రం సుయుక్సుహృత్. ౪౧
సహకృత్వా సహకర స్సహాయ స్సముపాయకః,

టీ. వయస్యా, ఆళీ, సహచరీ, సధ్రీచీ, సవయాః, సఖీ, ఈ౬-ను చెలికత్తె పేళ్లు.
ఆళీవివర్జితంసంఘుం=ఆళీశబ్దమునువిడిచిన చెలికత్తెల పేళ్లసమూహము. అనఁగా:—వయస్యః, సహచరః, సధ్ర్యఙ్, సవయాః, సఖా, ఈశబ్దములును, మిత్రం, సుయుక్, సుహృత్, సహకృత్వా, సహకరః, సహాయః, సముపాయకః, ఈ
౭ ను [illegible]

మూ. సనాభి స్సకులీన శ్చ సోదర్యోఽవరజోఽనుజః. ౪
కనీయా నగ్రజో జ్యేష్ఠభ్రాతా జామి స్స్వసాఽనుజా,
పత్యు స్స్వసా ననాందాస్యా న్మాతులానీ ప్రియాంబికా. ౪౩

టీ. సనాభిః, సకులీనః, ఈ ౨-ను ఒకగోత్రమువారికి పేళ్లు.
సోదర్యః, ఈ౧-ను తోడఁబుట్టినవాని పేరు.
అవరజః, అనుజః, కనీయాన్, ఈ 3 నుతమ్ముని పేళ్లు.
అగ్రజః, జ్యేష్ఠభ్రాతా, ఈ౨-ను అన్నపేళ్లు.
జామిః, స్వసా, అనుజా, ఈ 3-ను చెల్లెలపేళ్లు.

పత్యుః = మగనియొక్క, స్వసా=చెల్లెలు. ననాందా=వదిని, స్యాత్ = అగుచున్నది.
మాతులానీ, ప్రియాంబికా, ఈ ౨- ను మేనమామ పెండ్లము పేర్లు.

మూ. వైర్యరాతి రమిత్రోఽరి ర్ద్విట్సపత్నో ద్విషన్ రిపుః.
భ్రాతృవ్యో దుర్జన శ్శత్రు ర్దుర్హృ ద్ద్వేషీ ఖలోఽహితః. ౪౪

టీ. వైరీ, అరాతిః, అమిత్రం, అరిః, ద్విట్, సపత్నః, ద్విషత్, రిపుః, భ్రాతృవ్యః, దుర్జనః, శత్రుః, దుర్హృత్, ద్వేషీ, ఖలః, అహితః, ఈ౧౫- ను పగవాని పేళ్ళు.

మూ. దీధితి ర్భాను రుస్రోఽంశు ర్గభ స్తిః కిరణః కరః,
పాదో రుచి ర్మరీచి ర్భా తేజోఽర్చి ర్గౌ ర్ద్యుతిః ప్రభా. ౪౫
దీప్తి ర్జ్యోతి ర్మహో ధామ రశ్మి రూర్జో విభా వసుః,
శీతోష్ణప్రాయపూర్వ త్వే తద్వంతా విందుభాస్కరా. ౪౬

టీ. దీధితిః, భానుః, ఉస్రః, అంశుః, గభస్తిః, కిరణః, కరః, పాదః, రుచిః, మరీచిః, భా, తేజః, అర్చిః, గౌః, ద్యుతిః, ప్రభా, దీప్తిః, జ్యోతిః, మహః, ధామ, రశ్మిః, ఊర్జః, విభా, వసుః, ఈ ౨౪ నుకిరణములకు (కాంతికి) పేర్లు.

శీతోష్ణప్రాయపూర్వత్వే (అయియుపదినాలుగు శబ్దములు) శీత, ఉష్ణ, ఈయర్థములనిచ్చు పర్యాయనామములు మొదట చేరియుండుటచే, తద్వంతౌ = అదీధిత్యాదిశబ్దములు కలవారలు, ఇందుభాస్కరౌ = చంద్రసూర్యులు అగుచున్నారు.

(అనఁగా, శీతపర్యాయనామములు చేరునప్పుడు చంద్రునకును, ఉష్ణపర్యాయ నామములుచేరునప్పుడు సూర్యునకును పేళ్ళగును)

ఉదా:—శీతదీధితిః, శీతకరః, శీతాంశుః, శీతరుచిః, శీతకిరణః, శిశిరాంశుః, హిమకరః, హిమాంశుః, హిమరుచిః, తుహినద్యుతిః, ఇత్యాదులు చంద్రునకును; ఉష్ణదీధితిః, ఉష్ణమరీచిః, తీక్ష్ణకరః, తీక్ష్ణభానుః, ఉష్ణరశ్మిః, ఖరకరః, ఖరకిరణః, ఉష్ణాంశుః, ఇత్యాదులు సూర్యునకును పేళ్లగును

మూ. శశీ విధు స్సుధాసూతిః కౌముదీ కుముదప్రియః,
కలాభృ చ్చంద్రమా శ్చంద్రః కాంతిమా నోషధీశ్వరః. ౪౭

టీ. శశీ, విధుః, సుధాసూతిః, కౌముదీప్రియః, కుముదప్రియః, కలాభృత్, చంద్రమాః, చంద్రః, కాంతిమాన్, ఓషధీశ్వరః, ఈ౧౦ యు చంద్రునిపేళ్లు.

మూ. ఉడు భం తారకా ఋక్షం నక్షత్రం తత్పతి ర్నిశా,
క్షణదా రజనీ నక్తం దోషా శ్యామా చ తత్కరః. ౪౮

టీ. ఉడు, భం, తారకా, ఋక్షం, ఈ౫ను చుక్కలపేళ్లు.

తత్పతిః=ఆనక్షత్రపర్యాయనామములతోఁ జేరిన పతిపర్యాయశబ్దముచంద్రుని పేళ్లగును.

ఉదా:—ఉడుపతిః, ఉడునాథః, ఉడువల్లభః, ఋక్షపతిః, తారాపతిః, తారకాధవః, ఇత్యాదులు.

నిశా, క్షణదా, రజనీ, నక్తం, దోషా, శ్యామా, ఈ౬ను రాత్రిపేళ్లు.

తత్కరః=ఆరాత్రిపర్యాయములతోఁ జేరిన, కరశబ్దమును చంద్రునిపేళ్లగును. ఉదా:—నిశాకరః, క్షణదాకరః, రజనీకరః, దోషాకరః, శ్యామాకరః, నక్తంకరః, ఇత్యాదులు.

మూ. తరణి స్తపనో భాను ర్బ్రధ్నః పూషాఽర్యమా రవిః,
తిగ్మాంశు రంశు ర్ద్యుమణి ర్మార్తాండోఽర్కోఽదితే స్సుతః. ౪౯
ఇన స్సూర్య స్తమో నామ రిపు ర్మిత్రో విరోచనః,

టీ. తరణిః, తపనః, భానుః, బ్రధ్నః, పూషా, అర్యమా, రవిః, తిగ్మాంశుః, అంశుః ద్యుమణిః, మార్తాండః, అర్కః, అదితేస్సుతః, ఇనః, సూర్యః, ఈ ౧౫ను;

తమోనాపహరిపుః = చీఁకటిపర్యాయనామములతోఁ జేరిన శత్రుపర్యాయనామములును, అనఁగా:—తమోఽరిః, ధ్వాంతరిపుః, తిమిరవైరీ, ఇత్యాదులును;

మిత్రః, విరోచనః, ఈ ౨౭+౧౪=౧౭ ను సూర్యునిపేళ్లు.

మూ. దినం దివాఽహ ర్దివసో వాసర స్తత్కరశ్చ సః. ౫౦

టీ. దినం, దివా, అహః, దివసః, వాసరః, ఈ ౫ ను పగలుపేర్లు.

తత్కరః = అపగటిపర్యాయనామములతోఁ జేరిన కరశబ్దమును, సః= ఆసూర్యవాచక మగుచున్నది.

ఉదా:—దినకరః, దివాకరః, అహస్కరః, దివసకరః, ఇత్యాదులు.

మూ. చక్రవాకాబ్జపర్యాయబంధుశ్చ కమలప్రియః,
యమునాయమకానీనజనక స్సవితా మతః. ౫౧

టీ. చక్రవాకాబ్జపర్యాయబంధుః, చక్రవాక=చక్రవాకపక్షులయొక్కయు, అబ్జ=కమలములయొక్కయు, పర్యాయ=సామాన్యనామములతోఁ జేరిన, బంధుః=బంధుపర్యాయనామవాచకములును;

కమలప్రియః, కమల = పద్మపర్యాయనామములతోఁ గూడిన, ప్రియః=పతిపర్యాయశబ్దములును;

యమునాయమకానీనజనకః, యమునా= యమునానదియొక్కయు, యమ=యమధర్మరాజుయొక్కయు, కానీన=కర్ణునియొక్కయు; పర్యాయనామములతో సంబంధించిన, జనకః = తండ్రిపర్యాయనామములును, సవితా=సూర్యుఁడని, మతః=ఒప్పుకొనఁబడుచున్నది.

ఉదా.—లోకబంధుః, చక్రవాకప్రియః, రథాంగమిత్రం, కమలబంధుః, అబ్జబంధుః, కంజమిత్రం, పంకేజబాంధవః, కమలప్రియః, పంకజసుహృత్, పద్మసఖః, యమునాజనకః, కాళిందీపితా, యమజనకః, కాలపితా, అంతకతాతః, కర్ణజనకః, రాధేయపితా, ఇత్యాదులు.

మూ. వాహోఽశ్వ స్తురగో వాజీ హయో ధుర్య స్తురంగమః,
సప్తి రర్వా హరిం రథ్యో సప్తాద్యశ్వో మయూఖవాన్. ౫౨

టీ. వాహః, అశ్వః, తురగః, వాజీ, హయః, ధుర్యః, తురంగమః, సప్తిః, అర్వా, హరిః, రథ్యః, ఈ ౧౧ ను గుఱ్ఱముపేళ్లు.

సప్తాద్యశ్వః, సప్త=సప్తపదము, ఆది=పూర్వమందుగల, అశ్వః=అశ్వపర్యాయ నామము, మయూఖవాన్=సూర్యవాచక మగుచున్నది

ఉదా.—సప్తాశ్వః, సప్తసప్తిః, సప్తవాజీ, సప్తతురగః, సప్తతురంగమః, ఇత్యాదులు.

మూ. ఖం విహాయో వియ ద్వ్యోమ నభో గగన మంబరం,
ద్యా రాకాశ శ్చాంతరిక్షం మేఘవాయుపథోఽప్యతః. ౫౩

టీ. ఖం, విహాయః, వియత్, వ్యోమ, నభః, గగనం, అంబరం, ద్యౌః, ఆకాశః, అంతరిక్షం, ఈ ౧౦ యు ఆకాశమునకు పేళ్లు.

మేఘవాయుపథోఽపి, మేఘ=మబ్బుయొక్కయు, వాయు=గాలియొక్కయు, పర్యాయనామములతోఁ జేరిన, పథోపి=మార్గపర్యాయనామములును, ఆకాశమునకుఁ బేర్లగును.

ఉదా.—మేఘపథః, జీమూతవర్త్మా, వారిదాధ్వ, వాయుపథః, మారుతమార్గః, శ్వసనవర్త్మా, ఇత్యాదులు.

మూ. తచ్చరః ఖేచర స్తద్గః పక్షీ పత్త్రి పతత్ర్యపి,
శకుంత శ్శకుని ర్విశ్చ పతంగో విష్కిర స్తథా. ౫౪

టీ. తచ్చరః, తత్=ఆ ఆకాశపర్యాయనామములతోఁ గూడిన, చరః=సంచారపర్యాయనామములు (అనఁగా,—వియచ్చరః, వ్యోమచారీ, నభోగామీ, అంబరగః, ఇత్యాదులు) ఖేచరః=దేవయోనివిశేషములు అగుదురు.

తద్గోఽపి, తత్=ఆ అంతరిక్షపర్యాయనామములతోఁ జేరిన, గోఽపి=గశబ్దమును, (అనఁగా, ఆప్రకారముగనే, పక్షీ, పత్త్రి), పతత్రి, శకుంతః, శకునిః, విః, పతంగః, విష్కిరః, ఇవి ౮ యును పక్షిపేళ్లు.

మూ. జాంగలం పిశితం మాంసం పలం పేశీ చ తత్ప్రియః,
యాతుధాన స్తథా రక్షో రాత్ర్యాదిచర ఇష్యతే. ౫౫

టీ. జాంగలం, పిశితం, మాంసం, పలం, పేశీ, ఈ ౫ ను మాంసమునకు పేళ్లు.

తత్ప్రియః, తత్=ఆ మాంసపర్యాయనామములతో సంబంధించిన, ప్రియః =

ప్రియశబ్దము, అనఁగా,—మాంసప్రియః, జాంగలప్రియః, పిశితప్రియః, ఇత్యాదులును;

యాతుధానః, రక్షః, ఇవియును;

రాత్ర్యాదిచరః, రాత్రి=రాత్రిపర్యాయనామమే, ఆది=మొదటఁగల, చరః=చర శబ్దము, అనఁగా,—నిశాచరః, రాత్రించరః, క్షణదాచరః, నక్తంచరః, దోషాచరః, ఇత్యాదులును; ఇష్యతే=రాక్షసులపేళ్లని తలంపఁబడుచున్నది.

మూ. సుతోఽదితే స్తటిద్ధన్వా సేంద్రో దేవ స్సురోఽమరః,
స్వ ర్ద్యౌ స్స్వర్గోఽథ నాకశ్చ తద్వాస స్త్రిదశో మతః. ౫౬

టీ. అదితేః = అదితిశబ్దమునకుపరమైన, సుతః = పుత్రపర్యాయనామమును, (అనఁగా,—అదితిపుత్రః, అదితిసుతః, అదితిసూనుః, అదితినందనః, ఇత్యాదులును;)

తటిద్ధన్వా, సేంద్రః, దేవః, సురః, అమరః, ఈ ౫ ను దేవతలపేళ్లు.

స్వః, ద్యౌః, స్వర్గః, నాకః, ఈ ౪ ను స్వర్గలోకమునకు పేళ్లు.

తద్వాసః, తత్ = ఆస్వర్గపర్యాయనామములతోఁ జేరిన, వాసః=వాసపర్యాయనామములు, (అనఁగా,—నాకవాసీ, స్వర్గౌకాః, దివిషత్, స్వర్నిలయః, స్వర్గాలయః, ఇత్యాదులును;) త్రిదశః = దేవవాచకములని, మతః=సమ్మతింపఁబడుచున్నవి.

మూ. తత్పతి శ్శక్ర ఇంద్రశ్చ సునాసీర శ్శతక్రతుః,
ప్రాచీనబర్హి స్సుత్రామా వజ్రీ చాఖండలో హరిః. ౫౭
బిడౌజా శ్చాప్సురోనాథో వాసవో హరివాహనః,
మరుత్వా మరుత్వాం శ్చ వృషా చైరావణాధిపః. ౫౮
శతమన్యు స్తురాషాట్చ పురుహూతశ్చ కౌశికః,
సంక్రందనోఽథ మఘవా సహస్రాక్షో మరుత్సఖః. ౫౯
శత్రు ర్బలస్య గోత్రస్య పాకస్య నముచే రపి,
వృత్రస్య చ పులోమ్న శ్చ జంభస్య చ పురందరః. ౬౦

టీ. తత్పతిః తత్=ఆదేవపర్యాయనామములతో, పతిః=పతిపర్యాయనామము, (అనఁగా:—దేవపతిః, సురపతిః, అనిమిషనాథః, అమరాధిపః, గీర్వాణేశః, త్రిదశనాయకః ఇత్యాదులు.)

శక్రః, ఇంద్రః, సునాసీరః, శతక్రతుః, ప్రాచీనబర్హిః, సుత్రామా, ఐంద్రీ, అఖండలః, హరిః, బిడౌజాః, అప్సరోనాథః, వాసవః, హరివాహనః, మరుతః, మరుత్వాన్, వృషా, ఐరావణాధిపః, శతమన్యుః, తురాషాట్, పురుహూతః, కౌశికః, సంక్రందనః, మఘవాన్, సహస్రాక్షః, మరుత్సఖః, ఈశబ్దములును; బలస్య=బలశబ్దమునకును, గోత్రస్య=పర్వతపర్యాయనామమునకును, పాకస్య = పాకశబ్దమునకును, నముచేరపి = నముచిశబ్దమునకును, వృత్రస్యచ=వృత్రశబ్దమునకును, పులోమ్నశ్చ = పులోమన్ శబ్దమునకును, జంభస్యచ=జంభశబ్దమునకును, (పరమైన) శత్రుః=పర్యాయనామమును;

(అనఁగా,—బలారిః, బలరిపుః, బలవైరీ, బలద్విట్, గోత్రారిః, గోత్రరిపుః, నగవైరీ, నగారిః, పాకవిద్వేషీ, పాకారిః, నముచిరిపుః, నముచిసూదనః, నముచిద్వేషీ, వృత్రారిః, వృత్రహా, పులోమారిః, పులోమజిత్, జంభారిః, జంభభేదీ, అనునివియును) పురందరః=పురందరశబ్దమును, దేవేంద్రుని పేళ్లు.

మూ. కాష్ఠా కకుబ్దిగాశా చ దక్షకన్యా తథా హరిత్,
తత్పర్యాయపదం యోజ్యం ప్రాజ్ఞైః పాలగజాంబరైః. ౬౧

టీ. కాష్ఠా, కకుప్, దిక్, ఆశా, దక్షకన్యా, హరిత్, ఈఆరును దిక్కులకు పేళ్లు.

తత్పర్యాయపదం, తత్=ఆదిక్కు పర్యాయనామపదము, పాలగజాంబరైః,

పాల = పాలపర్యాయ శబ్దముతోను, గజ = గజపర్యాయశబ్దముతోను, అంబరైః=అంబరపర్యాయశబ్దముతోను, ప్రాజ్ఞైః = పండితులచేత, యోజ్యం=చేర్పఁబడినది. క్రముముగా, అష్టదిక్పాలురకును, దిగ్గజములకును, యోగులకును పేరగుచున్నది.

ఉదా:—కాష్ఠాపాలః, దిక్పాలః, ఆశాపాలకః, హరిత్పాలకః, ఇత్యాదులు దిక్పాలురకును;

కాష్ఠాగజః, దిగ్గజః, ఆశాహస్తీ, హరిన్నాగః, ఇత్యాదులు దిగ్గజములకును; కాష్ఠాంబరః, దిగంబరః, హరిద్వసనః, కకుబ్వాసాః, ఇత్యాదులు యోగులకును పేళ్లగును.

మూ. పవనః పవమానశ్చ వాయుశ్వాతోఽనిలో మరుత్,

సమీరణో గంధవాహ శ్శ్వసనశ్చ సదాగతిః. ౬౨

నభస్వా న్మాతరిశ్వాచ శరణ్యో జవన శ్చలః,
ప్రభంజన స్తత్పర్యాయః పుత్త్రో భీమోఽంజనాసుతః. ౬౩

టీ. పవనః, పవమానః, వాయుః, వాతః, అనిలః, మరుత్, సమీరణః, గంధవాహః, శ్వసనః, సదాగతిః, నభస్వాన్, మాతరిశ్వా, శరణ్యః, జవనః, చలః, ప్రభంజనః, ఈ ౧౬ ను గాలిపేళ్లు.

తత్పర్యాయపుత్త్రః, తత్=ఆవాయువుయొక్క, పర్యాయ=సామాన్యనామ పదముతో, పుత్త్రః = పుత్త్రపర్యాయనామపదము, భీమః=భీమసేనుఁడును, అంజనాసుతః=ఆంజనేయుఁడును పేర్కొనఁబడుదురు.

ఉదా:—పవనపుత్త్రః, పవనాత్మజః, పవమాననందనః, అనిలసూనుః, అనిలాత్మజః, ప్రభంజనతనయః, పవనసుతః, గంధవహతనయః, ఇత్యాదులు భీమసేనునకును. ఆంజనేయునకును పేళ్లు.

మూ. తత్సఖోఽగ్ని శ్శిఖీ వహ్నిః పావక శ్చాశుశుక్షణిః,
హిరణ్యరేతా స్సప్తార్చి ర్జాతవేదా స్తనూనపాత్. ౬౪
స్వాహాపతి ర్హుతాశశ్చ జ్వలనో దహనోఽనలః,
వైశ్వానరః కృశానుశ్చ లోహితాశ్వో విభావసుః. ౬౫
వృషాకపి శ్శమీగర్భో హవ్యవాహో ద్రుమాశనః,

టీ. తత్సఖః, తత్ = ఆవాయుపర్యాయనామముతో, సఖః = మిత్త్రపర్యాయనామమును,(అనఁగా—వాయుసఖః, పవనసుహృత్, అనిలమిత్త్రం, ప్రభంజనసుతః, అనిలసుహృత్, కృశానుసఖః, వాతసుహృత్, ఇత్యాదులును;)

అగ్నిః, శిఖీ,వహ్నిః, పావకః, ఆశుశుక్షణిః, హిరణ్యరేతాః, సప్తార్చిః, జాతవేదాః, తనూనపాత్, స్వాహాపతిః, హుతాశః, జ్వలనః, దహనః, అనలః, వైశ్వానరః,కృశానుః, లోహితాశ్వః, విభావసుః, వృషాకపిః, శమీగర్భః,హవ్యవాహః, ద్రుమాశనః, ఈ ౨౨ను అగ్నికి పేళ్లు.

మూ. తదాదిసూను స్సేనానీ స్కందశ్చ శిఖివాహనః. ౬౬
కార్త్తికేయో విశాఖశ్చ కుమార ష్షణ్ముఖో గుహః,
శక్తిమాన్ క్రౌంచభిదిచ స్వామీ శరవణోద్భవః. ౬౭

టీ. తదాదిసూనుః, తత్ =ఆయగ్నిపర్యాయ నామములే, ఆది=మొదట(గల, సూనుః= పుత్రపర్యాయనామము, (అనఁగా—వహ్నిపుత్రః, అగ్నిసుతః, కృశానుసూనుః, జాతవేదోఽపత్యం, పావకాత్మజః, జ్వలనతనయః, ఇత్యాదులును;)

సేనానీః, స్కందః, శిఖివాహనః, కార్తికేయః, విశాఖః, కుమారః, షణ్ముఖః, గుహః, శక్తిభృత్, క్రౌంచభేదీ, స్వామీ, శరవణోద్భవః, ఇవి ౧౨ ను సుబ్రహ్మణ్యస్వామి పేళ్లు.

మూ. తత్పితా శంకర శ్శంభుః శివ స్థాణు ర్మహేశ్వరః,
త్ర్యంబకో ధూర్జటి శ్శర్వః పినాకీ ప్రమథాధిపః. ౧౮
త్రిపురారి ర్విశాలాక్షో గిరీశో నీలలోహితః,
రుద్రేందుమౌళి ర్యజ్ఞారి స్త్రినేత్రో వృషభధ్వజః. ౧౯
ఉగ్ర శ్శూలీ కపాలీచ శిపివిష్టో భవో హరః,
ఉమాపతి ర్విరూపాక్షో విశ్వరూపః కపర్ద్యపి. ౨౦

టీ. తత్పితా, తత్ =ఆసుబ్రహ్మణ్యస్వామియొక్క పర్యాయనామములతో, పితా= తండ్రిపర్యాయశబ్దము, (అనఁగా—స్కందజనకః, సేనానీపితా, కార్తికేయ తాతః, అగ్నిభూపితా, షణ్ముఖజనకః. ఇత్యాదులును;)

శంకరః, శంభుః, శివః, స్థాణుః, మహేశ్వరః, త్ర్యంబకః, ధూర్జటిః, శర్వః, పినాకీ, ప్రమథాధిపః, త్రిపురారిః, విశాలాక్షః, గిరీశః, నీలలోహితః, రుద్రః, ఇందుమౌళిః, యజ్ఞారిః, త్రినేత్రః, వృషభధ్వజః, ఉగ్రః, శూలీ, కపాలీ, శిపివిష్టః, భవః, హరః, ఉమాపతిః, విరూపాక్షః, విశ్వరూపః, కపర్దీ, ఈ ౨౯-యు శివుని పేళ్లు.

మూ. అపర్ణా గిరిజా గౌరీ భవానీ పార్వతీ శివా,
చండీ దాక్షాయణీ దుర్గా చాంబికా హిమవత్సుతా. ౨౧

టీ. అపర్ణా, గిరిజా, గౌరీ, భవానీ, పార్వతీ, శివా, చండీ, దాక్షాయణీ, దుర్గా అంబికా, హిమవత్సుతా, ఈ ౧౧ ను పార్వతీదేవి పేళ్లు.

మూ. భాగీరథీ త్రిపథగా జాహ్నవీ హిమవత్సుతా,
మందాకినీ ద్యుపర్యాయధునీ గంగా చ తచ్ఛిరాః. ౭౨
తదీశ్వర శ్చేశ్వరస్య సముద్రస్యాఽభిధాభవేత్,

టీ. భాగీరథీ, త్రిపథగా, జాహ్నవీ, హిమవత్సుతా, మందాకినీ, గంగా ఈ ఐను; ద్యుపర్యాయధునీ, ద్యు=ఆకాశముయొక్కయు, స్వర్గముయొక్కయు, సామాన్య నామముతో, ధునీ=నదీపర్యాయనామములును, (అనఁగా—ద్యునదీ, వ్యోమాంతరంగిణీ, అంభరధునీ, గగననిమ్నగా, స్వర్గాపగా, త్రిదివస్రవన్తీ, ఇత్యాదులును;) గంగానదికి పేళ్లు.

తచ్ఛిరాశ్చ, తత్=ఆగంగానదియే, శిరాశ్చ=తలయందుఁగలవాఁడైన, అనఁగా, గంగాపర్యాయనామములతో శివపర్యాయనామములుగల శివుఁడును, తదీశ్వరః, తత్=ఆగంగాపర్యాయనామములతోఁ జేరిన, ఈశ్వరః= పతిపర్యాయనామమును, ఈశ్వరస్యచ=శివునకును, సముద్రస్య = సముద్రమునకును, అభిధా=నామము, భవేత్ = అగును.

అనఁగా—గంగోత్తమాంగః, భాగీరథీశీర్షః, మందాకినీమస్తకః, ఇవి శివునకును; గంగాపతిః, భాగీరథీధవః, జాహ్నవీదయితః, త్రిపథగారమణః, మందాకినీవల్లభః, ఇత్యాదులు శివునికిని, సముద్రునికిని పేళ్లగును.

మూ. విధి ర్వేధా విధాతా చ విరించిశ్చ పితామహః. 23
హిరణ్యగర్భ స్స్రష్టా చ ప్రజాపతి స్సహస్రపాత్,
బ్రహ్మాత్మభూ రనంతాత్మా ద్రుహిణోఽజ శ్చతుర్ముఖః. ౭౪
పద్మపర్యాయయోనిశ్చ తత్పుత్త్రో నారద స్స్మృతః,

టీ. విధిః, వేధాః, విధాతా, విరించిః, పితామహః, హిరణ్యగర్భః, స్రష్టా, ప్రజాపతిః, సహస్రపాత్, బ్రహ్మా, ఆత్మభూః, అనంతాత్మా, ద్రుహిణః, అజః, చతుర్ముఖః, ఇవియును;

పద్మపర్యాయయోనిశ్చ, పద్మ = కమలముయొక్క, పర్యాయ=పర్యాయనామములతోఁ జేరిన యోనిశ్చ = ఉత్పత్తిపర్యాయనామములును, (అనఁగా—కమలయోనిః, పద్మజః, అరవిందభూః, కోకనదభవః, పంకజోద్భవః, ఇత్యాదులును;) బ్రహ్మదేవుని పేళ్లగును.

తత్ = ఆబ్రహ్మపర్యాయనామములతోఁజేరిన, పుత్రః = పుత్రపర్యాయనామము, నారదః = నారదఋషి, స్మృతః=చెప్పఁబడెను.

అనఁగా—అజసూనుః, బ్రహ్మనందనః, వేధస్తనూజః, విధాత్రపత్యం, ఇత్యాది శబ్దములును నారదఋషిపేళ్లు.

మూ. కృష్ణో దామోదరో విష్ణు రుపేంద్రః పురుషోత్తమః. ౭౫
గోవిందో వాసుదేవశ్చ పద్మనాభో ఽప్యధోక్షజః,
కేశవశ్చ హృషీకేశ శ్శార్ఙ్గీ నారాయణో హరిః. ౭౬

టీ. కృష్ణః, దామోదరః, విష్ణుః, ఉపేంద్రః, పురుషోత్తమః, గోవిందః, వాసుదేవః, పద్మనాభః, అధోక్షజః, కేశవః, హృషీకేశః, శార్ఙ్గీ, నారాయణః, హరిః, అనునీశబ్దములును;

మూ. కేశీ మధు ర్బలి ర్బాణో హిరణ్యకశిపు ర్మురః,
నరకః కైటభః కంసః పర్యాయపద మాసురం. ౭౭
ఇత్యాదిసూదన శ్శౌరిః

టీ. కేశీ = కేశిశబ్దము, మధుః = మధుశబ్దము, బలిః = బలిశబ్దము, బాణః=బాణశబ్దము, హిరణ్యకశిపుః = హిరణ్యకశిపుశబ్దము, మురః = మురశబ్దము, నరకః = నరకశబ్దము, కైటభః = కైటభశబ్దము, కంసః = కంసశబ్దము, అసురః= అసురసంబంధియైన, పర్యాయపదం = పర్యాయశబ్దమును, ఇత్యాదిసూదనః – ఇతి = అనునిట్టిశబ్దములు, ఆది = మొదలుఁగల, సూదనః = సూదనశబ్దమునకు పర్యాయశబ్దమును;

(అనఁగా—కేశిసూదనః, కేశిద్వేషీ, మధుసూదనః, మధువైరీ, బలిసూదనః, బలిధ్వంసీ, బాణసూదనః, బాణవైరీ, హిరణ్యకశిపుసూదనః, మురవైరీ, నరకారీ, కైటభజిత్, కంసారాతిః, అసురారిః, దైత్యారిః, దానవాంతకః, ఇత్యాదులును;) శౌరిః = విష్ణుదేవునిపేళ్లు.

మూ. లక్ష్మీ శ్శ్రీ ర్గోమి నీందిరా,



టీ. లక్ష్మీః, శ్రీ, గోమినీ, ఇందిరా, ఇవి రను లక్ష్మీదేవిపేళ్లు.

మో. తత్పతి శ్శైలభూమ్యాది ధరో భూమిధరోఽచలః. ౨౮

తత్పతిః, తత్ = ఆలక్ష్మీపర్యాయనామములతో, పతిః = పతిపర్యాయము మును, (అనఁగా:—లక్ష్మీపతిః, శ్రీవల్లభః, గోమినీస్వామీ, ఇందిరాధవః, ఇత్యాదులును,) శైలభూమ్యాదిధరః, శైల=పర్వతపర్యాయనామమును, భూమి= భూపర్యాయనామమును, ఆది = మొదటగల, ధరః = ధరపర్యాయశబ్దమును, (అనఁగా.—శైలధరః,గిరిధృత్, అచలధారీ, భూమిధరః, భూమిభృత్, భూమి ధారీ, ఇత్యాదులును,) విష్ణుదేవుఁడే యగును.

భూమిధరః=ఆభూమిపర్యాయనామములతోడి, ధరపర్యాయపదము, అచలః= పర్వతము నగును.(అనఁగా.—భూమిధరః,భూమిధృత్,భూభృత్,భూమిభృత్, భూభృత్, భూమిధారీ, ఇత్యాదులు,) పర్వతమునకును పేళ్ళగును.

మూ. తత్పుత్రో మన్మథః కామః శూర్పకారి రనన్యజః,
కాయపర్యాయరహితో మదనో మకరధ్వజః. ౨౯

టీ. తత్పుత్రః,తత్=ఆవిష్ణుపర్యాయనామములతో,పుత్రః=పుత్రపర్యాయనామమును, (అనఁగా.—కృష్ణసుతః, విష్ణుసూనుః, పురుషోత్తమాత్మజః, దామోదరాపత్యం, శౌరితనయః, కేశవపుత్రః. ఇత్యాదులు.)

మన్మథః, కామః, శూర్పకారిః, అనన్యజః, మదనః,మకరధ్వజః, ఇవియును; కాయపర్యాయరహితః= శరీరపర్యాయనామములతో అభావపర్యాయనామమును, (అనఁగా.—అనంగః, దేహరహితః, అమూర్తిః, అతనుః, అశరీరః, అకళేబరః, ఇత్యాదులును;) మన్మథుని పేళ్లగును.

మూ. శిలీముఖ శ్శరో బాణో మార్గణో రోపణః కణః,
ఇషుః కాండం క్షురప్రం చ నారాచం తోమరం తథా. ౩౦
కార్ముకం ధన్వ చాపశ్చ ధర్మః కోదండకోధనుః,
శిలీముఖాద్యాసనంచ తత్కోటీ మటనీంవిదుః. ౩౧

టీ. శిలీముఖః,శరః, బాణః, మార్గః, రోపణః, కణః, ఇషుః, కాండం, క్షురప్రం, నారాచం, తోమరం, కార్ముకం, ధన్వ, చాపః, ధర్మః, కోదండః, ధనుః ఈ ౧౭ ను వింటి పేళ్లు.

శిలీముఖాద్యాసనంచ= శిలీముఖశబ్దము మొదలగుగాఁగల బాణపర్యాయనామములతో, ఆసనశబ్దమును. (అనఁగా.—బాణాసనం మార్గణాసనం, ఇష్వాసనం, క్షురప్రాసనం, ఇత్యాదులును;) వింటిపేళ్లు.

తత్కోటీం - తత్ = ఆధనుస్సుయొక్క, కోటీం = కొనను, అటనీం=అటని యని, విదుః = తెలియుచున్నారు, (చెప్పుచున్నారు.)

మూ. పుష్పం సుమనసః ఫుల్లం లతాంతం ప్రసవోద్గమం,
ప్రసూనం కుసుమం జ్ఞేయ స్తదాదిస్తుశరస్స్మరః. ౮౨

టీ. పుష్పం, సుమనసః, ఫుల్లం, లతాంతం, ప్రసవం, ఉద్గమం, ప్రసూనం, కుసుమం, ఈ ౮ పువ్వులపేళ్లు.

తదాదిః, తత్ = ఆపుష్పపర్యాయనామములు, ఆదిః= మొదటఁగల, శరిస్తు = బాణపర్యాయనామమో, స్మరః = మన్మథుఁడుగానే, జ్ఞేయః = తెలియఁదగినవాఁడు.

ఉదా.— పుష్పబాణః, కుసుమేషుః, ఫుల్లశరః, లతాంతమార్గణః, ప్రసూననారాచః, ఇత్యాదులును మన్మథునిపేళ్లయగును.

మూ. స్వాంత మాశ్వనితం చిత్తం చేతోఽంతఃకరణం మనః,
హృదయం విశిఖాకూతం మార స్తత్సంభవోమతః. ౮౩

టీ. స్వాంతం, ఆశ్వనితం, చిత్తం, చేతః, అంతఃకరణం, మనః, హృదయం, విశిఖం, ఆకూతం, ఈ ౯ మనస్సునకు పేళ్లు.

తత్ = ఆమనస్సుయొక్క పర్యాయనామములతో, సంభవః=ఉత్పత్తిపర్యాయశబ్దమును, మారః = మన్మథుఁడుగానే, మతః=సమ్మతమైనవాఁడు.

ఉదా.—స్వాంతభూః, చిత్తజః, మనోజః, చేతోజాతః, మనసిజః,ఇత్యాదులును మన్మథునిపేళ్లు.

మూ. మౌర్వీ జీవ గుణౌ జ్యాచ అళి ర్భృంగ శ్శిలీముఖః,
భ్రమర షట్పదో జ్ఞేయో ద్విరేఫశ్చ మధువ్రతః. ౮౪

టీ. మౌర్వీ, జీవః, గుణః, జ్యా, ఈ ౪ నుల్లెత్రాటిపేళ్లు.

అలిః భృంగఃశిలీముఖః, భ్రమరః, షట్పదః, ద్విరేఫః, మధువ్రతః, ఈ ౭ పేళ్లును తుమ్మెదగా, జ్ఞేయః=తెలియఁదగినది.

మూ. మార్వ్యాదిప్రాంత మళ్యాదికందర్పస్సై క్షవంధనుః,

టీ. మార్వ్యాదిప్రాంతం - మార్వీ = మార్వీశబ్దము, ఆది = మొదలైనశబ్దములు ప్రాంతం = కొనయందుఁగల, అళ్యాది = అలిశబ్దముమొదలైన భ్రమరపర్యాయనామములును;

సైక్షవం = ఇక్షుసంబంధిశబ్దముతోఁగూడిన, ధనుః = వింటిపర్యాయనామములును; కందర్పః=మన్మథవాచకము లగుచున్నవి.

ఉదా. —అలిగుణః, భృంగజీవః, షట్పదజ్యః, మధువ్రతమార్వీః, ఇక్షుధన్వా, ఇక్షుకార్ముకః, ఇక్షుచాపః, ఇక్షుకోదండః, ఇత్యాదులు మన్మథునకుపేళ్లు.

మూ. హేతి రస్త్రాయుధం శస్త్రం పుష్పాద్యస్త్రస్స్మర స్స్మృతః. ౧౫

టీ. హేతిః, అస్త్రం, ఆయుధం, శస్త్రం ఈ ౪ను ఆయుధములకుపేళ్లు.

పుష్పాద్యస్త్రః, పుష్ప = కుసుమపర్యాయనామము, ఆది = మొదటగల, అస్త్రః = ఆయుధపర్యాయనామముగలవాఁడు, స్మరః = మన్మథుఁడని, స్మృతః=తలఁపఁబడుచున్నాఁడు.

ఉదా.—పుష్పాయుధః, కుసుమాస్త్రః, ఫుల్లబాణః, కుసుమేషుః, లతాంతిశరః, ప్రసవహేతిః, ప్రసూనశస్త్రః, ఇత్యాదులును మన్మథుని పేళ్లు.

మూ. ధ్వజః పతాకా కేతుశ్చ చిహ్నం తద్వైజయం త్యపి,
తత్తదంతఝషాద్యాది శ్శంభోర్విఘ్నకర స్స్మరః. ౧౬

టీ. ధ్వజః, పతాకా, కేతుః, చిహ్నం, వైజయంతీ, ఈ ౫ను టెక్కెము పేళ్లు. తత్తదంత ఝషాద్యాదిః, తత్తదంత = ఆయాధ్వజపర్యాయనామములు తుదియందుఁగల, ఝషాద్యాదిః = మత్స్యాదిపర్యాయనామములు మొదటఁగలశబ్దములు, (అనఁగా—మీనకేతుః, ఝషధ్వజః, అండజపతాకః, పాఠీనకేతనః, ఇత్యాదులును); శంభోః = శివపర్యాయనామములకంటె, విఘ్నకరః = తపోభంగకారి యను పర్యాయనామములు గలవాఁడును, స్మరః, మన్మథుఁడేయగును. (అనగా—శంభువిఘ్నకరః, శివవిఘ్నకృత్, ఈశతపోభంజకః, ఇత్యాదులును) మన్మథవాచకము లగును.

మూ. కౌక్షేయకోఽసి ర్నిస్త్రింశః కృపాణః కరవాలకః,
తరవారి ర్మండలాగ్రః ఖడ్గనామావళిం విదుః. ౮౭

టీ. కౌక్షేయకః, అసిః, నిస్త్రింశః, కృపాణః, కరవాలకః, తరవారిః, మండలాగ్రః, ఈ ౭ శబ్దములును, ఖడ్గనామావళిం, ఖడ్గ=కత్తియొక్క, నామ = పేళ్లయొక్క, ఆవళిం=సమూహముగా, విదుః=తెలిసికొందురు. (అనఁగా చెప్పెదరనుట.)

మూ. అక్షౌహిణీ బలానీకం వాహినీ సాధనం చమూః,
ధ్వజినీ పృతనా సేనా సైన్యం దండం వరూథినీ. ౮౮

టీ. అక్షౌహిణీ, బలం, అనీకం, వాహినీ, సాధనం, చమూః, ధ్వజినీ, పృతనా, సేనా సైన్యం, దండం, వరూథినీ, ఈ ౧౨ ను సేనపేళ్లు.

మూ. కదనం సమరం యుద్ధం సంయుగం కలహో రణః,
సంగ్రామ స్సాంపరాయాజీ సంయ దాహు ర్మహాహవం. ౮౯

టీ. కదనం, సమరం, యుద్ధం, సంయుగం, కలహః, రణః, సంగ్రామః, సాంపరాయః, ఆజిః, సంయత్, ఈ ౧౦ యు, మహాహవం = మహాయుద్ధపర్యాయ నామము లని, ఆహుః=చెప్పెదరు.

మూ. గజో మతంగజో హస్తీ వారణోఽనేకపః కరీ.
శుండాల స్సామజో నాగో మాతంగః పుష్కరీ ద్విపః. ౯౦
దంతీ స్తంబేరమః కుంభీ ద్విరదేభమతంగమాః,
కరేణు స్సింధుర స్తేషు యాతా యంతా నిషాద్యపి. ౯౧

టీ. గజః, మతంగజః, హస్తీ, వారణః, అనేకపః, కరీ, శుండాలః, సామజః, నాగః, మాతంగః, పుష్కరీ, ద్విపః, దంతీ, స్తంబేరమః, కుంభీ, ద్విరదః, ఇభః, మతంగమః, కరేణుః, ఈ ౨౧యు ఏనుఁగుపేళ్లు.

తేషు = ఆఏనుఁగులయందు, యాతాఃపోవుహాఁడు, యంతా, నిషాదీ, అను నీరెండుశబ్దములను వాడ్యుఁడగుచున్నాఁడు. (అనఁగా — ఈ ౨ ను మావటివాని పేళ్లనట.)

మూ. నాగాద్యరిః కంఠీరవో మృగేంద్రః కేసరీ హరిః,
వ్యాఘ్రశ్చమూరు శ్శార్దూల శ్శరభోఽష్టాపదోఽష్టపాత్. ౯౨

టీ. నాగాద్యరిః, నాగ=ఏనుఁగుపర్యాయనామములే, ఆది=మొదటఁగల, అరిః=శత్రు పర్యాయనామములును, (అనఁగా—నాగారిః, గజరిపుః, వారణద్విట్, ద్విపవైరీ, ఇత్యాదులును;) కంఠిరవః, (కంఠీరవః), మృగేంద్రః, కేసరీ, హరిః, ఈ ౪ ను సింహము పేళ్లు.

వ్యాఘ్రః, చమూరుః, శార్దూలః, ఈ 3 ను పులి పేళ్లు

శరభః, అష్టాపదః, అష్టపాత్, ఈ 3 ను ఎనిమిదికాళ్లు గలశరభమృగమునకు పేళ్లు.

మూ. క్రోడో వరాహో దంష్ట్రీచ ఘృష్టిః పోత్రీచ సూకరః,
ఉష్ట్రో మయ శ్శృంఖలకః కరభ శ్శీఘ్రగామికః. ౯3

టీ. క్రోడః, వరాహః, దంష్ట్రీ, ఘృష్టిః, పోత్రీ, సూకరః, ఈ ౬ ను పంది పేళ్లు. ఉష్ట్రః, మయః, శృంఖలకః, కరభః, శీఘ్రగామికః, ఈ ౫ ను ఒంటె పేళ్లు.

మూ. కౌలేయక స్సారమేయో మండలీ శ్వా పురోగతిః,
జిహ్వాపో గ్రామశార్దూలః (సింహశ్చ) కుక్కురో రాత్రిజాగరః.

టీ. కౌలేయకః, సారమేయః, మండలీ, శ్వా, పురోగతిః, జిహ్వాపః, గ్రామశార్దూలః. (గ్రామసింహః), కుక్కురః, రాత్రిజాగరః, ఈ ౯ యు కుక్క పేళ్లు.

మూ. స్వర్ణ మష్టాపదం హేమ కనకార్జున కాంచనం,
హిరణ్యం జాతరూపంచ శాతకుంభంచ హాటకం. ౯౫
తపనీయం కలాధౌతం కార్తస్వరశిలోద్భవమ్,

టీ స్వర్ణం, అష్టాపదం, హేమ, కనకం, అర్జునం, కాంచనం, హిరణ్యం, జాతరూపం, శాతకుంభం, హాటకం, తపనీయం, కలాధౌతం, కార్తస్వరం, శిలోద్భవం, ఈ ౧౪ ను బంగారు పేళ్లు.



మూ. రజతం రౌప్య గలిక శుక్తిజం మౌక్తికం అథ. ౯౬

టీ. రజతం, రౌప్యం, గులికం, ఈ ౩ ను వెండి పేళ్లు.
శుక్తిజం, మౌక్తికం, ఈ ౨ ను ముత్తెము పేళ్లు.

మూ. విత్తం వస్తు వసు ద్రవ్యం స్వర్ణం రై ద్రవిణం ధనం,
కస్వరం తత్పతిఃప్రాహుః కుబేర శ్చైకపింగలః. ౯౭
రాజరాజో వైశ్రవణః ఉత్తరాశాపతి స్తథా,
అలకానిలయ శ్రీదో ధనపర్యాయదాయకః. ౯౮

టీ. విత్తం, వస్తు,వసు,ద్రవ్యం,స్వర్ణం,రై, ద్రవిణం, ధనం,కస్త్వరం, ఈ ౯ యు ధనమునకు పేళ్లు.

తత్పతిః = ఆధనపర్యాయనామములతోఁ జేరిన పతిపర్యాయనామము, (అనఁగా:—ధనపతిః, ద్రవ్యనాథః, ధనాధిపః, విత్తనాయకః, వస్వధిపః, ఇత్యాదులును;కుబేరః, ఏకపింగలః, రాజరాజః, వైశ్రవణః, ఉత్తరాశాపతిః, అలకానిలయః, శ్రీదః, ఇవియును;

ధనపర్యాయదాయకః, ధన = ద్రవ్యముయొక్క, పర్యాయ=నామములతోఁ గూడిన, దాయకః=దాతృపర్యాయనామమును, (అనఁగా:— ధనదః, విత్తదాయకః, వసుదః, రైదః, ద్రవిణదాతా, ఇత్యాదులును;) కుబేరుని పేళ్ళని,ప్రాహుః=చెప్పెదరు.

మూ. రాష్ట్రం జనపదో నిర్గో జనాంతో విషయ స్మృతః,

టీ. రాష్ట్రం, జనపదః,నిర్గః, జనాంతః,విషయః,ఈ ౫ ను దేశము పేళ్లని, స్మృతః= తలఁపఁబడి యున్నది.

మూ. పూః పురీ నగరం చైవ పత్తనం పుటభేదనమ్. ౯౯

టీ. పూః, పురీ, నగరం, పత్తనం, పుటభేదనం, ఈ ౫ పట్టణమునకు పేళ్లు.

మూ. వక్త్రం లపన మాస్యం చ హ్యాననం వదనం ముఖమ్,

టీ. వక్త్రం, లపనం, ఆస్యం, ఆననం, వదనం, ముఖం, ౬ ను ముఖమునకును నోటికిని పేళ్లు.

మూ. శ్రుతిశ్ప శ్రవణం శ్రోత్రం శ్రవః కర్ణ స్తథైవచ. ౧౦౦

టీ. శ్రుతిః, శ్రవణం, శ్రోత్రం, శ్రవః, కర్ణః, ఈ ౫ చెవికిపేళ్లు.

మూ. దృ గక్షి చక్షు ర్నయనం దృష్టి ర్నేత్రం విలోచనమ్.

టీ. దృక్, అక్షి, చక్షుః, నయనం, దృష్టిః, నేత్రం, విలోచనం, ఈ ౭ను కంటిపేళ్లు.

మూ. కటాక్ష కేకరాపాంగా విభ్రమా స్తేన వై కృతాః. ౧౦౧

టీ. తేన = ఆకంటివలన, కృతాః = చేయఁబడిన, విభ్రమాః = విలాసములు, కటాక్ష కేకరాపాంగాః—కటాక్షః, కేకరః, అపాంగః, ఈమూఁడుపేళ్లు గలవి యగు చున్నవి. (అనఁగా, క్రీగంటిచూపు మొదలగు విశేషములు.)

మూ. దంతవాసోఽధరో ఓష్ఠో వర్ణితో దశనచ్ఛదః,

టీ. దంతవాసః, ఓష్ఠః, వర్ణితః, దశనచ్ఛదః, ఈ౪ ను పెదవిపేళ్లు

మూ. శిరోధరో గళో గ్రీవా కంఠశ్చ ధమని ర్ధమః. ౧౦౨

టీ. శిరోధరః, గళః, గ్రీవా, కంఠః, ఈ ౪ ను గొంతు పేళ్లు.
ధమనిః, ధమః, ఈ ౨ ను నరముల పేళ్లు.

మూ. దో ర్దోషాచ భుజో బాహుః పాణిర్హ స్తః కర స్తథా,

టీ దోః, దోషా, భుజము పేళ్లు.
పాణిః, హస్తః, ఈ 3 చేయి పేళ్లు.

మూ. ప్రాహు ర్బాహు శిరో హ్యంసో హస్తశాఖః కరాంగుళిః. ౧౦3

టీ. బాహుశిరః, ఈ ౨ మూపు పేళ్లు.
హస్తశాఖః, కరాంగుళిః, ఈ ౨ ను చేతివ్రేళ్లని, ప్రాహుః = చెప్పెనరు.

మూ. ఉరచ్ఛదః కుచో వక్షో రుహ స్తన పయోధరా,
నాసాఘ్రాణ ముగో వక్షః కుక్షిశ్చ జఠరోదరమ్. ౧౦౪

టీ. ఉరచ్ఛదః, కుచః, వక్షోరుహః, పయోధరః, ఈ ౫ ను కుచము పేళ్లు.
నాసా, ఘ్రాణం, ఈ ౨ ను ముక్కు పేళ్లు.
ఉరః, వక్షః, ౨ ను ఱొమ్ము పేళ్లు.
కుక్షిః, జఠరం, ఉదరం, ఈ 3 ను కడుపుపేళ్లు.

దీనికిపాఠాంతరము. (మూఁడుశ్లోకములు.)

మూ. దో ర్దోషా బాహు బాహా చ భుజా భుజఇతీరితః,
తదంతర ముకోవక్ష స్తచ్ఛిరోఽంసః ప్రకీర్తితః.
తచ్ఛద స్తద్రుహాశ్చాపి పయోధర కుచ స్తనాః,

టీ. దోః, దోషా, బాహుః బాహా, భుజా, భుజః, ఈ ౬ ను భుజముపేళ్లు అని, ఈరితః = చెప్పఁబడెను.
తదంతరం, తత్ = ఆభుజవాచకములతోఁగూడిన, అంతరం = అంతరశబ్దమును (అనఁగా, దోరంతరం, బాహ్వంతరం, బాహాంతరం, భుజాంతరం అనియు) ఉరః, వక్షః, అనియు వక్షః స్థలమునకు పేళ్లు.
తచ్ఛిరః, తత్ = ఆభుజవాచకములతోఁగూడిన, శిరః = శిరశ్శబ్దము (అనఁగా భుజశిరః, బాహుశిరః అని) అంసః = మూఁపు, ప్రకీర్తితః = చెప్పఁబడెను.
తచ్ఛదః - తత్ = ఆవక్షఃస్థలవాచకములతోఁగూడిన, ఛదః = ఛదశబ్దమును, తద్రుహాశ్చాపి = ఆవక్షఃస్థలవాచకములతోఁగూడిన రుహాశబ్దమును (అనఁగా, ఉరశ్ఛదః, వక్షోరుహః, అనియును, అపిశబ్దమువలన, ఉరోజః, వక్షోజః అనియును) పయోధరః, కుచః, స్తనః, అనియును కుచముపేళ్లు అగును.

మూ. కరః పాణిశ్చ హస్తశ్చ తచ్ఛాఖస్తు తదంగుళిః. 2
నఖస్స్యా త్తద్రుహాశ్చాపి ఘ్రాణంనాసాచనాసికా,

టీ. కరః, పాణి, హస్తః, ఈ 3 ను చేతి పేళ్లు.
తచ్ఛాఖః, తత్ = ఆకరవాచకముతోఁగూడిన, శాఖః = శాఖశబ్దము (అనఁగా కరశాఖః, హస్తశాఖః, అని) తదంగుళిః = ఆకరాంగుళి (చేతివ్రేలిపేరు) అగును.
తద్రుహాశ్చాపి, తత్ = ఆకరవాచకములతోఁగూడిన, రుహశ్చాపి = రుహాశబ్దమును, అపిశబ్దమువలన జ శబ్దమును (అనఁగా కరరుహః, కరజః, అని) నఖః = గోరు, స్యాత్ = అగును.
ఘ్రాణం, నాసా, నాసికా, ఈ 3 ను ముక్కుపేళ్లు.

మూ. ఉదరం జఠరం కుక్షి ర్గర్భో జన్మస్థలం విదుః. 3

టీ. ఉదరం, జఠరం, కుక్షిః, ఈ 3 ను కడుపుపేళ్లు.
గర్భః = గర్భశబ్దము, జన్మస్థలం = జన్మస్థానమునుగా, విదుః = తెలియుదురు.

మూ. కటి ర్నితంబ శ్శ్రోణిశ్చ జఘనం జాను జంఘవత్,

టీ. కటిః, నితంబః, శ్రోణిః, జఘనం, ఈ ४ ను పిఱుఁదుపేళ్లు.
జానుః, జంఘవత్, ఈ ౨ను మోకాలిపేళ్లు.

మూ. చరణం చలనం పాదః క్రమ మంఘ్రిః పదం విదుః. ౧౦౫

టీ. చరణం, చలనం, పాదః, క్రమం, అంఘ్రిః, పదం, ఈ ౬ ను అడుగుపేళ్లని, విదుః=తెలియుదురు.

మూ. శిరో మూర్ధో త్తమాంగం కం ప్రారబ్ధం ప్రేరి తేరితం,

టీ. శిరః, మూర్ధా, ఉత్తమాంగః, కం, ఈ ४ ను తలపేళ్లు.
ప్రారబ్ధం, ప్రేరితం, ఈరితం ఈ ౩ ను కర్మపరంపరపేళ్లు.

మూ. వాగ్వచో వచనం వాణీ భారతీ గీ స్సరస్వతీ. ౧౦౬

టీ. వాక్, వచః, వచనం, వాణీ, భారతీ, గీః, సరస్వతీ, ఈ ౭ ను మాటపేళ్లు. వచః, వచనం, అను నీరెండుపేళ్లు తప్ప తక్కిన యైదుపేళ్ళును శారదాదేవిపేళ్లని కొందఱందురు.

మూ. సింహద్వీపిఘనే గర్జో హేషాఽశ్వే బృంహితం గజే,
సీత్కృతం ధేనుకలభే స్తనితంజలదేతథా. ౧౦౭

టీ. సింహద్వీపిఘనే, సింహ = సింగమునందును, ద్వీపి=పులియందును, ఘనే=మేఘమునందును, గర్జః = గర్జమనుశబ్దమును;

అశ్వే=గుఱ్ఱమునందు, హేషా=హేష యనుశబ్దమును;

గజే=ఏనుఁగునందు, బృంహితం=బృంహితమనుశబ్దమును;

ధేనుకలభే, ధేను=పశువునందును, కలభే=ఏనుఁగుగున్నయందును, సీత్కృతం= సీత్కృత మనుశబ్దమును;

తథా = ఆప్రకారముగనే, జలదే = మేఘమునందు, స్తనితం= స్తనిత మనుశబ్దమును, అనుకరణశబ్దములుగా చెప్పఁబడును. అనఁగా ఈ శబ్దములు వానివాని ధ్వనులకు సంకేతశబ్దములనుట.

మూ. స్యందనే చీత్కృతం మంత్రే భటే ఘృష్టోచ హుంకృతం,
సీత్కృతం మణితం కామే ఖణత్కృతం శృంఖలాయుధే. ౧౦౮

టీ. స్యందనే = తేరువలనఁగలుగుశబ్దమునందు, చీత్కృతం = చీత్కృతమనియును, మంత్రే = ఆలోచనయందును, భటే = యోధనమందును; ఘృష్టోచ = గలుగు శబ్దము, హుంకృతం = హుంకృతమనియును, (ఘృష్టో—చింత్యము) కామే= స్త్రీపురుష విహారమునందు కలుగుశబ్దమునకు, సీత్కృతం = సీత్కృతమనియు ను, మణితం = మణితమనియును, శృంఖలాయుధే, శృంఖలా = సంకెలయందు ను, ఆయుధే = ఆయుధమంగునుగలుగుశబ్దము, ఖణత్కృతం = ఖణత్కృతమని యును పేళ్లు.

మూ. మంజీరకతులాకోటినూపురే తత్ర ఝుంకృతం,
ఝుణత్కృతం మారుతే క్రౌంచ హంసయోః క్రేంకృతం మతమ్.

టీ. మంజీరకతులాకోటినూపురే, మంజీరక = కాలిఅందెలయందును, తులాకోటి =కాలిగొలుసులయందును, నూపురే = గండపెండెరమునందును గలుగుశబ్దము, ఝుంకృతం=ఝుంకృత మనియును;

మారుతే=గాలివలనఁగలుగుధ్వనియందు, ఝుణత్కృతం=ఝుణత్కృతమనియును; క్రౌంచహంసయోః, క్రౌంచ=కొంగయందును, హంసయోః = హంసయందును గలుగుశబ్దము, క్రేంకృతం=క్రేంకృతమనియును, మతం = సమ్మతింపఁబడినది.

మూ. ప్రతీతం సుస్థితం లబ్ధం దృష్టం పరిచితమ్ మతమ్.

టీ. ప్రతీతం, సుస్థితం, లబ్ధం, దృష్టం, ఈ ౪ ను పరిచితం=పరిచయముకలదియనుటకు పేళ్లని, మతం=ఒప్పఁబడుచున్నది.

మూ. సంస్థితం దశమీస్థం చ పరాసుంచ మృతం విదుః. ౧౧౦

టీ. సంస్థితం, దశమీస్థం, మృతం, ఈ 3 ను పరాసుం = ప్రాణవియోగమయిన వానినిగా, విదుః=తెలియుదురు.

మూ. భేదో ద్వేషోఽప్యమర్షశ్చ రోష రుట్క్రోధ మన్యవః,

టీ. భేదః, ద్వేషః, అమర్షః, రోషః, రుట్, క్రోధః, మన్యుః, ఈ ౭ను కోపముపేళ్లు.

మూ. హర్ష ప్రమోద ప్రముద ము త్సోషానంద ముత్సవః ౧౧౧

టీ. హర్షః, ప్రమోదః, ప్రమదః, ముత్, తోషః, ఆనందః, ఉత్సవః, ఈ ౭ ను సంతోషము పేళ్లు.

మూ. కృపాఽనుకంపాఽనుక్రోశో హంతోక్తిః కరుణా దయా,

టీ. కృపా, అనుకంపా, అనుక్రోశః, హంతోక్తిః, కరుణా, దయా, ఈ ౬ ను దయను పేళ్లు.

మూ. శేముషీ ధిషణా ప్రజ్ఞా మనీషా ధీ స్తథాఽఽశయః. ౧౧౨

టీ. శేముషీ, ధిషణా, ప్రజ్ఞా, మనీషా, ధీః, ఆశయః, ఈ ౬ ను బుద్ధి పేళ్లు.

మూ. ప్రాజ్ఞో మేధాదిమా న్విద్వా నభిరూపో విచక్షణః,
పండిత స్సూరి రాచార్యో వాగ్మీ నైయాయిక స్స్మృతః. ౧౧౩

టీ. ప్రాజ్ఞః, విద్వాన్, అభిరూపః, విచక్షణః, పండితః, సూరిః, ఆచార్యః, వాగ్మీ, నైయాయికః, అనునవియును;

మేధాదిమాన్, మేధాది=మేధాశబ్దము మొదలైన జ్ఞానవిశేషపర్యాయనామములతోఁ గూడిన, మాన్=కల, అనెడు అర్థమునిచ్చుప్రత్యయములతోఁ జేరినశబ్దములును, (అనఁగా— మేధావాన్, ప్రజ్ఞావాన్, బుద్ధిమాన్, ప్రతిభానవాన్, ధీమాన్ ఇత్యాదులును) విద్వాంసుల పేరని, స్మృతః=చెప్పఁబడినది.

మూ. పారిషద్యో బుధ స్సభ్య స్సదస్యః పరిషత్సభా,
ఆస్థానాధిపతీ రాజా రాజసూయో నృపక్రతుః. ౧౧౪

టీ. పారిషద్యః, బుధః, సభ్యః, సదస్యః, ఈ ౪ ను సభయందు ప్రసంగముచేయఁదగిన పండితుని పేళ్లు.

పరిషత్, సభా, ఈ ౨ ను సభ పేరు.

ఆస్థానాధిపతిః, ఆస్థాన=సభాపర్యాయనామములతోఁ జేరిన, అధిపతిః=ప్రభుపర్యాయనామములు, అనఁగా, సభాపతిః, పరిషదధిపః, ఆస్థాననాయకః, పరిషదధీశ్వరః, ఇత్యాదులు, రాజా=ఆసభానాయకుని పేళ్లు.

నృపక్రతుః, నృప=ప్రభువులుచేయఁదగిన, క్రతుః=యజ్ఞము, రాజసూయః=రాజసూయ మని చెప్పఁబడును.

మూ. విష్టపం భువనం లోకో జగ త్తస్య పతి ర్జినః,
సర్వజ్ఞో వీతరాగోఽర్హా న్కేవలీ ధర్మచక్రభృత్. ౧౧౫
తీర్థంకర స్తీర్థకర స్తీర్థకృద్దివ్యవాక్పతిః,

టీ. విష్టపం, భువనం, లోకః, జగత్, ఈ ౪ ను ప్రపంచము పేళ్లు.

తస్య=ఆజగత్తుయొక్క పర్యాయనామములతోఁ జేరిన, పతిః=ప్రభుపర్యాయ నామము (అనఁగా:—జగత్పతిః, లోకనాథః, జగత్స్వామీ, భువనాధిపః, విష్టపేశః, ఇత్యాదులును;)

జినః, సర్వజ్ఞః, వీతరాగః, అర్హాన్, కేవలీ, ధర్మచక్రభృత్, తీర్థంకరః, తీర్థకరః, తీర్థకృత్, దివ్యవాక్పతిః, ఇవియును ఆదిజినుని పేళ్లు.

మూ. విష్టరం మల్లికా పీఠ మాసందీ చాసనం విదుః. ౧౧౬

టీ. విష్టరం, మల్లికా, పీఠం, ఆసందీ, ఆసనం, ఈ ౫ ను జపము మొదలగునవిచేయు కాలమున క్రిందవేసికొను పీఁట మొదలగువాని పేళ్లని, విదుః=తెలియుదురు.

మూ. చేలం నివసనం వాస శ్చీన మంబర మంశుకం,
వస్త్రాద్యంతదిగాద్యాదిసంజ్ఞకో వృషభేశ్వరః. ౧౧౭

టీ. చేలం, నివసనం, వాసః, చీనం, అంబరం, అంశుకం, ఈ ౬ ను వస్త్రము పేళ్లు. వృషభేశ్వరః=వృషభనాథస్వామి, వస్త్రాద్యంతదిగాద్యాదిసంజ్ఞకః, వస్త్రాద్యంతి=వస్త్రాదిపర్యాయశబ్దములు, అంతి = తుదియందును, దిగాది=దిగాదిపర్యాయశబ్దములు, ఆది=మొదటనుగల, సంజ్ఞకః=పేరుగలవాఁడుగాఁ దెలియఁదగినని.

(అనఁగా:—దిగంబరః, దిగ్వాసాః, దిగంశుకః, దిశావసనః, ఇత్యాదులును ఆవృషభేశ్వరస్వామి పేళ్లు.)

మూ. వర్షీయా న్వృషభో జ్యాయా న్పురు రాద్యః ప్రజాపతిః,
ఐక్ష్వాకుః కాశ్యపో బ్రహ్మా గౌతమో నాభిజోఽగ్రజః. ౧౧౮

టీ. వర్షీయాన్, వృషభః, జ్యాయాన్, పురుః, ఆద్యః, ప్రజాపతిః, ఐక్ష్వాకుః, కాశ్యపః, బ్రహ్మా, [illegible] భస్వామి పేళ్లు.

మూ. సన్మతి ర్మహతి ర్వీరో మహావీరోఽన్త్యకాశ్యపః,
నాథాన్వయో వర్ధమానో యత్తీర్థ మిహ సాంప్రతమ్. ౧౧౯

టీ. సన్మతిః, మహతిః, వీరః, మహావీరః, అంత్యకాశ్యపః, నాథాన్వయః, వర్ధమానః, ఈ ౭ ను, ఇహ=ఈలోకమునందు, యత్తీర్థం=ఎవరివలన అప్పుడు (పూర్వము) చేయఁబడినదో, సాంప్రతం=ఇప్పుడును జరుగవలసి యున్నదో, అట్టి పశ్చిమతీర్థంకరుఁడైన వర్ధమానస్వామి పేళ్లు.

మూ. కుంకుమం రుధిరం రక్తం కస్తూరీ మృగనాభిజం,
కర్పూరం ఘనసారశ్చ హిమం సేవేత్తు పుణ్యవాన్. ౧౨౦

టీ. కుంకుమం, రుధిరం, రక్తః ఈ ౩ ను కుంకుమపూవు పేళ్లు.

కస్తూరీ, మృగనాభిజం, ఈ ౨ ను కస్తూరి పేళ్లు.

కర్పూరం, ఘనసారః, హిమం, ఈ ౩ ను పచ్చకర్పూరము పేళ్లు.

పుణ్యవాన్ = సుకృతముగలవాఁడు, సేవేత్ = (ఈవస్తువులను) సేవించును.

మూ. సమాలంభోఽంగరాగశ్చ ప్రసాధన విలేపనే,
భూషణాఽభరణే రుచ్య మాల్య మాలా గుణి స్రజః, ౧౨౧

టీ. సమాలంభః, అంగరాగః. ప్రసాధనం, విలేపనం, ఈ ౪ ను అనులేపన భేదము పేళ్లు.

భూషణం, ఆభరణం, ఈ ౨ ను నగ పేళ్లు.

రుచ్యం, మాల్యం, మాలా, గుణీ, స్రక్, ౫ ను హారమునకు పేళ్లు.

మూ. మేఖలా రశనా కాంచీ హేమపర్యాయసూత్రకం,
శ్రోణిబింబే కటీసూత్రం మానసూత్ర మిహోద్ధృతమ్. ౧౨౨

టీ. మేఖలా, రశనా, కాంచీ, ఈ ౩ ను ఒడ్డాణము పేళ్లు.

హేమపర్యాయసూత్రకం, హేమ = బంగారుయొక్క పర్యాయనామముల తోఁజేరిన, సూత్రకం=అంతుపర్యాయనామము, (అనఁగా:—స్వర్ణసూత్రకం, కనకసూత్రం, స్వర్ణదాను, హిరణ్యసూత్రం, ఇత్యాదులు) శ్రోణిబింబే= జఘన

ప్రదేశమునందు, ఉద్ధృతం = ధరింపఁబడిన, కటీసూత్రమివ = మొలత్రాడువంటి, మానసూత్రం = ఉత్తరీజందెము పేళ్లు.

మూ. మదిరా మధు మైరేయం శీధుః కాదంబరీ త్విరా,
ప్రసన్నా వారుణీ హాలా మధువారాఽసురీ తథా. ౧౨౩

టీ. మదిరా, మధు, మైరేయం, శీధుః, కాదంబరీ, ఇరా, ప్రసన్నా, వారుణీ, హాలా, మధువారా, ఆసురీ, ఈ ౧౧ ను;

మూ. శుండాసవ స్తద్విధాయీ శౌండో గద్యేత మద్యపః,
శక్తోఽక్షద్యూతపానేషు విచిత్రా శబ్దపద్ధతిః. ౧౨౪

టీ. శుండా, ఆసవః, ఈ ౨ ను పైనిచెప్పిన ౧౧ను, అంతు ౧౩ పేళ్లును కల్లు (లేక) సారాయి పేళ్లు.

తద్విధాయీ, తత్ =ఆసారాయిని, విధాయీ = చేయువాఁడును, మద్యపః= కల్లుత్రాగువాఁడును, అక్షద్యూతపానేషు, అక్షః=నెత్తమునందును, ద్యూత=జూద మాడుటయందును, పానేషు=త్రాగుటయందును, శక్తః = సమర్థుఁడైనవాఁడును, శౌండః = శౌండుఁ డని, గద్యేత=చెప్పఁబడును. శబ్దపద్ధతిః = ఇట్టిశబ్దమార్గము, విచిత్రా = ఆశ్చర్యకరమైనది.

మూ. సర్పి ర్హైయ్యంగవీనాజ్యం దుగ్ధం క్షీరామృతం పయః,
ఉదశ్విన్మథితం తక్రం కాలశేయం పిబే ద్గురుః. ౧౨౫

టీ. సర్పిః, హైయ్యంగవీనం, ఆజ్యం, ఈ ౩ ను నెయ్యి పేళ్లు.

దుగ్ధం, క్షీరం, అమృతం, పయః, ఈ ౪ ను పాలు పేర్లు.

ఉదశ్విత్, మథితం, తక్రం, కాలశేయం, ఈ ౪ ను మజ్జిగభేదముల పేళ్లు.

గురుః = శ్రేష్ఠుఁడైనవాఁడు, పిబేత్ = (నెయ్యి, పాలు, మజ్జిగ, వీనిని) పానము చేయవలయును.

మూ. ప్రాయః పయో దశానేహాః పూర్ణయావనకం విదుః,
తారుణ్యం యౌవనం ... ర్ష్య... ష్ఠావిరో మతః. ౧౨౬

టీ. ప్రాయః, వయః, దశా, అనేహాః, ఈ ర ను వయస్సు పేళ్లు.

పూర్ణయౌవనకం=పరిపూర్ణప్రాయమును, తారుణ్యం=తారుణ్య మనియును, యౌవనం=యౌవనమనియును, విదుః=తెలిసికొందురు.

అంత్యః, జర్ణీణః, స్థవిరః, ఈ 3 ను వృద్ధుని పేళ్లని, మతః=సమ్మతపడినది.

మూ. హంసో మరాళో వక్రాంగో హంసవాహః పితామహః,

టీ. హంసః, మరాళః, వక్రాంగః, ఈ 3 ను అంచ పేళ్లు.

హంసవాహః, హంస = హంసపర్యాయనామములతోఁ జేరిన, వాహః=అశ్వ పర్యాయనామముగలవాఁడు, పితామహః=బ్రహ్మదేవుఁడు. (అనఁగా:—హంస వాహః, మరాళాశ్వః, వక్రాంగతురంగః, ఇత్యాదులు బ్రహ్మదేవుని పేళ్లు.)

మూ. మయూరో బర్హిణః కేకీ శిఖీ ప్రావృట్పిక స్తథా. ౧౨౭
నీలకంఠః కలాపీ చ శిఖండీ తత్పతి ర్గుహః,

టీ. మయూరః, బర్హిణః, కేకీ, శిఖీ, ప్రావృట్పికః, నీలకంఠః, కలాపీ, శిఖండీ, ఈ ౮ యు నెమలి పేళ్లు.

తత్పతిః, తత్=అ నెమలిపర్యాయనామములతోఁ గూడిన, పతిః=పతిపర్యాయ నామముగలవాఁడు, (అనఁగా,—మయూరపతిః, కేకీవల్లభః, నీలకంఠనాథః, ఇత్యాదులు) గుహః = కుమారస్వామి పేళ్లు.

మూ. హరిణో న్యంకు పృషతౌ తదంక శ్శర్వరీశ్వరః. ౧౨౮

టీ. హరిణః, న్యంకుః, పృషతః, ఈ 3 ను జింక పేళ్లు.

తదంకః, తత్=అజింకపర్యాయనామములతోఁ జేరిన, అంకః=చిహ్నపర్యాయ నామముగలవాఁడు, (అనఁగా:—హరిణాంకః, మృగాంకః, న్యంకులక్ష్మా, ఇత్యాదులు) శర్వరీశ్వరః = చంద్రుఁడు అగును.

మూ. పన్నగోఽహి ర్విషధరో లేలిహానో భుజంగమః,
నాగోరగా ఫణీ సర్ప స్తదై ర్వరీ వినతాత్మజః. ౧౨౯

టీ. పన్నగః, అహిః, విషధరః, లేలిహానః, భుజంగమః, నాగః, ఉరగః, ఫణీ, సర్పః, ఈ ౯ యు పాముపేళ్లు.

తద్వైరీ, తత్=ఆసర్పపర్యాయనామములతోఁ గూడిన, వైరీ=శత్రుపర్యాయనామము గలవాఁడు (అనఁగా, నాగారిః, పన్నగరిపుః, ఉరగద్విట్, భుజంగమవిపక్షః, అహివైరీ, సర్పపరిపంథీ, పిషధరారాతిః, ఇత్యాదులు) వినతాత్మజః=గరుత్మంతుఁడు అగును.

మూ. సుపర్ణో గరుడ స్తార్క్ష్యో గరుత్మాన్ శకునీశ్వరః,
ఇంద్రజి న్మంత్రపూతాత్మా వైనతేయో విపక్షయః. ౧౩౦

టీ. సుపర్ణః, గరుడః, తార్క్ష్యః, గరుత్మాన్, ఇవి ౪ ను, మఱియు; శకునీశ్వరః, శకుని=పక్షిపర్యాయనామములతోఁ జేరిన, ఈశ్వరః=ప్రభుపర్యాయనామమును, (అనఁగా—విహగేశ్వరః, ఖగనాథః, పతగాధిపః, పక్షిరాజః, శకునినాయకః, ద్విజరాజః, పతంగనేతా, విహంగమాధిభూః, ఇత్యాదులును) మఱియు, ఇంద్రజిత్, మంత్రపూతాత్మా, వైనతేయః, విపక్షయః, ఇవియును గరుత్మంతుని పేళ్లు.

మూ. ఖ మింద్రియం హృషీకం చ స్వాంతో౽క్షం కరణం విదుః,
పుణ్యం భాగ్యం చ సుకృతం భాగధేయం చ సత్కృతమ్. ౧౩౧

టీ. ఖం, ఇంద్రియం, హృషీకం, స్వాంతం, అక్షం, కరణం, ఈ ౬ ను ఇంద్రియములపేళ్లు గా, విదుః=తెలిసికొందురు.

పుణ్యం, భాగ్యం, సుకృతం, భాగధేయం, సత్కృతం, ఈ ౫ ను పుణ్యముపేళ్లు.

మూ. అఘ మంహశ్చ దురితం పాపం పాప్మా చ కిల్బిషం,
వృజినం కలిలం చైనో దుష్కృతం తజ్జయీ జినః. ౧౩౨

టీ. అఘం, అంహః, దురితం, పాపం, పాప్మా, కిల్బిషం, వృజినం, కలిలం, ఏనః, దుష్కృతం, ఈ ౧౦ యు పాపము పేళ్లు.

తజ్జయీ, తత్=అపాపపర్యాయనామములతోఁ జేరిన, జయీ=జయించినవాని పర్యాయనామము గలవాఁడు, (అనఁగా—వృజినజిత్, దురితజయీ, దుష్కృతజేతా, అఘహరః, కిల్బిషధ్వంసీ, కలిలనాశకః, ఇత్యాదులు) జినః = జినేశ్వరవాచకములు అగుచున్నది.

మూ. సదనం సద్మ భవనం ధిష్ణ్యం వేశ్మాథ మందిరం,
గేహం నికేతనాగారం నిశాంతం నిలయం గృహం. ౧౩౩

వసత్యావసథావాసం స్థానం ధామాస్పదం పదం,
నికాయ్యో నిలయోవస్త్యం శరణం శిబిరాలయాః. ౧౩౪

టీ. సదనం, సద్మ, భవనం, ధిష్ణ్యం, వేశ్మ, మందిరం, గేహం, నికేతనం, అగారం, నిశాంతం, నిర్వృతం, గృహం, వసతిః, ఆవసథం, ఆవాసం, స్థానం, ధామ, ఆస్పదం, పదం, నికాయ్యః, నిలయః, వస్త్యం, శరణం, శిబిరం, ఆలయః, ఈ ౨౫ ను ఇంటి పేళ్లు.

మూ. ఖేయం ఖాతం చ పరిఖా వప్రం స్యా ద్ధూళికుట్టిమం,
ప్రాకారః పరిధి స్సాలః ప్రతోళీ గోపురాకృతిః. ౧౩౫

టీ. ఖేయం, ఖాతం, పరిఖా, ఈ 3 ను అగడ్త పేళ్లు.

వప్రం, ధూళికుట్టిమం, ఈ ౨ ను బురుజు(కొత్తళము) పేళ్లు, స్యాత్=అగును.

ప్రాకారః, పరిధిః, సాలః, ఈ 3 ను కోట పేళ్లు.

ప్రతోళీ, గోపురాకృతిః-ఈ ౨ ను రాజవీథి పేళ్లు.

మూ. ప్రాసాద స్సౌధహర్మ్యాది ర్నిర్వ్యూహో మత్తవారణః,
వాతాయన మథాలంబ మాలంబ్యం సుఖ మాసతామ్. ౧౩౬

టీ. ప్రాసాదః=ప్రాసాదశబ్దము, సౌధహర్మ్యాదిః, సౌధ = రాజగృహము, హర్మ్య=ధనికులగృహము, ఆదిః=మొదలుగాఁగలది, అగును.

నిర్వ్యూహః, మత్తవారణః, ఈ ౨ ను చూఱుకు ఆధారముగా గోడకునాటునట్టి మ్రాని పేళ్లు. (దంతె).

వాతాయనం, ఆలంబం, ఆలంబ్యం, ఈ 3 ను ఆసతాం=కూర్చుండునట్టివారికి, సుఖం=సుఖప్రదమైన, గవాక్షము పేళ్లు.

మూ. సమ స్సవర్ణ స్సాజాత్య స్సదృక్ష స్సదృశ స్సదృక్,
తుల్య స్సధర్మా సారూప్యం తులా కక్ష్యోపమాభిధాః. ౧౩౭

టీ. సమః, సవర్ణః, సాజాత్యః, సదృక్షః, సదృశః, సదృక్, తుల్యః, సధర్మా, ఈ ౮ యు సమానమైనదానికి పేళ్లు.

సారూప్యం, తులా, కక్ష్యా, ఈ 3 ను ఉపమాభిధాః=ఉపమానము పేళ్లు.

మూ. వ్రాతః పూగ స్సమాజశ్చ సమూహ స్సంతతి ర్వ్రజః,
వ్యూహో నికాయో నికరో నికురుంబం కదంబకం, ౧౩౮
గణ స్సముదయ స్సంఘ స్సంఘాత స్సమితి స్తతిః,
నిచయః ప్రకరః పఙ్క్తిః పశూనాం సమజోదజౌ. ౧౩౯

టీ. వ్రాతః, పూగః, సమాజః, సమూహః, సంతతిః, వ్రజః, వ్యూహః, నికాయః, నికరః, నికురుంబం, కదంబకం, గణః, సముదయః, సంఘః, సంఘాతః, సమితిః, తతిః, నిచయః, ప్రకరః, పఙ్క్తిః, ఈ ౨౦ యు సమూహము పేళ్లు.

సమజః- ఉదజః ఈ ౨ ను పశూనాం=పశువులయొక్క సమూహము పేళ్లు.

మూ. సమీపాభ్యాస మాసన్న మభ్యర్ణం సన్నిధిం విదుః,
అవిదూరం చ నికట మవలగ్న మనంతరమ్. ౧౪౦

టీ. సమీపం, అభ్యాసం, ఆసనం, అభ్యర్ణం, అవిదూరం, నికటం, అవలగ్నం, అనంతరం, ఈ ౮ యు, సన్నిధిం = సమీపవాచకములుగా, విదుః=తెలిసికొందురు. (అనఁగా— ఇవి సమీపమనుటకు నామములు.)

మూ. జిత్యం హాలం హల స్సీరం లాంగలం తత్కరో బలః,
రేవతీదయితో నీలవసనః కేశవాఽగ్రజః. ౧౪౧

టీ. జిత్యం, హాలం, హలః, సీరం, లాంగలం, ఈ ౫ ను నాగలి పేళ్లు.

తత్కరః, తత్ =ఆనాగలిపర్యాయనామములతోఁ జేరిన, కరః=హస్తపర్యాయనామముగలవాఁడు, (అనఁగా, హలకరః, సీరహస్తః, లాంగలపాణిః, జిత్యశయః, ఇత్యాదులును) బలః, రేవతీదయితః- రేవతీ = రేవతీశబ్దముతోఁ జేరిన, దయితః =పతిపర్యాయనామములుగలవాఁడును, (అనఁగా, రేవతీప్రియః, రేవతీరమణః, రేవతీధవః, రేవతీపతిః, ఇత్యాదులును) నీలవసనః, కేశవాగ్రజః, ఇవి యును బలరాముని పేళ్లు.

మూ. అర్జునః ఫల్గునో జిష్ణు శ్శ్వేతవాజీ కపిధ్వజః.
గాండీవీ కార్ష్ణిక స్సవ్యసాచీ మధ్యమపాండవః. ౧౪౨

వృషసేనశ్చ నిర్మోకో దైత్యారి శ్శక్రనందనః,
కర్ణకాలః కిరీటీ చ శబ్దభేదీ ధనంజయః. ౧౪౩

టీ. అర్జునః, ఫల్గునః, జిష్ణుః, ఇవియును; శ్వేతవాజీ, శ్వేత = శుభ్రపర్యాయనామములతోఁ జేరిన, వాజీ = అశ్వపర్యాయనామములుకలవాఁడును; కపిధ్వజః, కపి = కపిపర్యాయనామముతోఁ జేరిన, ధ్వజః = టెక్కెముయొక్కపర్యాయ నామములుగలవాఁడును, (అనఁగా, హరికేతనః, కపికేతనః, ప్లవంగధ్వజః, వానర ధ్వజః, ఇత్యాదులును); గాండీవకార్ముకః, సవ్యసాచీ, మధ్యమపాండవః, వృష సేనః, నిర్మోకః, దైత్యారిః, శక్రనందనః, కర్ణకాలః, కిరీటీ, శబ్దభేదీ, ధనం జయః, ఇవియును అర్జునుని పేర్లు.

మూ. కురుకీచకయో శ్శత్రు ర్వాయుపుత్రో వృకోదరః,
సమవర్తీ యమః కాలః కృతాంతో మృత్యు రంతకః. ౧౪౪

టీ. కురుకీచకయోః, కురు = కురుశబ్దముతోడను, కీచకయోః = కీచకశబ్దముతోడను చేరిన, శత్రుః = శత్రుపర్యాయనామము గలవాఁడును (అనఁగా, కురువైరీ, కురు సపత్న్యః, కురుద్విట్, కురువిపక్షః, కీచకారిః, కీచకరిపుః, కీచకాహితః, కీచకా మిత్రః, ఇత్యాదులును); వాయుపుత్రః-వాయు=వాయుపర్యాయనామములతోఁ జేరిన, పుత్రః=పుత్రపర్యాయనామమును, (అనగా, ప్రభంజనాత్మజః, మారుత సూనుః, ఆశుగతనయః, గంధవాహతనూభవః, మారుతిః, ఇత్యాదులును); వృకో దరః, ఇవియును భీమసేనుని పేర్లు.

సమవర్తీ, యమః, కాలః, కృతాంతః, మృత్యుః, అంతకః, ఈ ౬ను యము ధర్మరాజు పేర్లు.

మూ. తదాత్మజో౽జాతరిపుః కౌంతేయో భరతాన్వయః,
కౌరవ్యో రాజసూయష్టాచ సోమవంశ్యో యుధిష్ఠిరః. ౧౪౫

టీ. తదాత్మజః-తత్ = ఆయముపర్యాయనామములతోఁ జేరిన, ఆత్మజః = పుత్రపర్యా యనామమును, (అనఁగా, సమవర్తితనయః, యమసూనుః, అంతకపుత్రః, కృతాం తాత్మజః, ఇత్యాదులును); అజాతరిపుః, కౌంతేయః, భరతాన్వయః, కౌరవ్యః, రాజసూయష్టా, సోమవంశ్యః, యుధిష్ఠిరః. ఇవియును, పాండుపుత్రుఁడైన ధర్మ రాజు పేర్లు.

మూ. వళక్షం శ్వేత గౌరే చ సిత మర్జున మిత్యపి,
శుక్లావదాతే ధవళః పాండు శ్శుభ్రి శ్శశిప్రభః. ౧౪౬

టీ. వళక్షం, శ్వేతం, గౌరం, సితం, అర్జునం, శుక్లం, అవదాతం ధవళః, పాండుః, శుభ్రిః, శశిప్రభః, ఈ ౧౧ ను తెల్లనివన్నె పేర్లు. మఱియు, తెలుపైన దానికిని పేర్లు.

మూ. కృష్ణం నీలాసితే కాలో ధూమధూమ్ర మళిప్రభం,
తమోఽంధకార స్తిమిరం ధ్వాంతం సంతమసం తమః. ౧౪౭

టీ. కృష్ణం, నీలం, అసితం, కాలః, ధూమధూమ్రం, అళిప్రభం, ఈ ౬ ను నల్లని రంగు పేర్లు. మఱియు, నలుపైనదానికిని పేర్లు.

తమః, అంధకారః, తిమిరం, ధ్వాంతం, సంతమసం, తమః, ఈ౬ను చీకటిపేర్లు

మూ. శ్యామః పీతో హరిః పింగః కర్బురో రుధిరారుణే,
రోహితో రక్త తామ్రేచ పాటలం కపిశం తథా. ౧౪౮

టీ. శ్యామః = ఇదినలుపుకలిసినపసుపువన్నెకుపేరు.

పీతః = ఇదిబంగారుపసుపువన్నెకుపేరు.

హరిః = ఇదిపసుపువన్నెకుపేరు.

పింగః = ఇది ఎఱుపుకలిసినపసుపురంగునకుపేరు.

కర్బురః = ఇదినలుపుపసుపుఎఱుపుకలిసినరంగునకు పేరు.

రుధిరం, అరుణం, రోహితః, రక్తం, తామ్రం, పాటలం, ఈ౬నుఎఱ్ఱనిచాయకు పేర్లు.

కపిశం=ఇది నలుపు తెలుపు ఎఱుపునుగల కోతిచాయకుపేరు.

మూ. హరిణో రోహిత శ్శోణో గౌరీ శ్శైనీ పిశంగ్యపి.
సారంగీ శబళీ కాళీ కల్మాషీ నీలపింగళీ. ౧౪౯

టీ. హరిణః, ఇది చిలుకరెక్కవన్నెపేరు.

రోహితః, ఇది శ్రీగంధపుచాయపేరు.

శోణః, ఇది దాసనిపూవువన్నెపేరు.

గౌరీ, శ్యైనీ, ఈ౨ను తెల్లకలువపూవు రంగు పేర్లు.

పిశంగీ, ఇది గోరింటపువ్వువన్నె పేరు.

సారంగీ, శబలీ, ౨ చిత్రవర్ణముల పేర్లు.

కాళీ, ఇది చీఁకటియీనవన్నె పేరు.

కల్మాషీ. ఇది తెలుపు నలుపుగూడిన వన్నె పేరు.

నీలపింగళీ, ఇది ఇంచుక ఎఱుపురంగుపేరు.

మూ. పరాగో మధుసంఛన్నం మకరందశ్చ కౌసుమం,
ఉపచారా ద్రజః పాంసూ రేణు ధూళీచ యోజయేత్. ౧౫౦

టీ. పరాగః, మధుసంఛన్నం, మకరందః, కౌసుమం, ఈ ౪ను పుప్పొడి పేర్లు.

రజః, పాంసుః, రేణుః, ధూళిః, ఈ ౪ శబ్దములును, చకారమువలన, ఉపచారాత్ = ఔపచారికభావమువలన, యోజయేత్ = పరాగనామములతోఁ జేర్పఁదగినది (సూక్ష్మార్థమునందీనాలుగును దుమ్మునకుపేర్లు)

మూ. కలంకవద్యమలినం లేఖా లక్ష్మచ లాంచనం,
నిర్వ్యాధ మధమం పంకం మలీమస మపి త్యజేత్. ౧౫౧

టీ. కలంకం, వద్యం, మలినం, లేఖా, లక్ష్మ, లాంఛనం, ఈ ౬ను గుఱుతు పేర్లు. నిర్వ్యాధం, అధమం, పంకం, మలీమసం, ఈ ౪ను అపకీర్తి పేర్లు. త్యజేత్ = ఈయపకీర్తిని విడువవలయును.

మూ. జనోదాహారణం కీర్తి స్సాధువాదో యశో విదుః,
వర్ణ్యం గుణావళిః ఖ్యాతి రపదానం చ సాహసమ్. ౧౫౨

టీ. జనోదాహరణం, కీర్తిః, సాధువాదః, యశః, వర్ణ్యం, గుణావళిః, ఖ్యాతిః, ఈ ౭ను కీర్తిపేర్లుగా, విదుః = తెలిసికొందురు.

అపదానం, సాహసం, ఈ ౨ను వెనుకటిసమాచారముపేళ్లని, విదుః=తెలిసికొందురు,

మూ. ప్రేషాదేశనిదేశా చ నియోగ శ్శాసనం తథా,
సందేశః ప్రియయా శ్శాక్త ప్రవృత్తిః కంపవర త్యపి. ౧౫౩

టీ. ప్రేషా, ఆదేశః, నిదేశః, ఆజ్ఞా, నియోగః, శాసనం, ఈ ౬ ను ఆనతి పేర్లు. సందేశః, ఇది, ప్రియయోః = ఇష్టులైనయిద్దఱయొక్క, వార్తా = సమాచారము పేర్లు.

ప్రవృత్తిః, కింవదంతీ, ఈ ౨ ను లోకులుచెప్పుకొనుట పేర్లు.

మూ. కఠోరం కఠినం స్తబ్ధం కర్కశం పరుషం దృఢం,
అశ్లీలం కాహలం ఫల్గు కోమలం మృదు పేశలే. ౧౫౪

టీ. కఠోరం, కఠినం, స్తబ్ధం, కర్కశం, పరుషం, దృఢం, ఈ ౬ ను గట్టియైన దాని పేర్లు.

అశ్లీలం, కాహలం, ఫల్గు, ఈ 3 ను అసారవస్తువుపేర్లు.
కోమలం, కాహలం, మృదు, పేశలం, ఈ 3 ను మెత్తనైనదానిపేర్లు.

మూ. ప్రత్యగ్రం సాంప్రతం నవ్యంనవం నూతన మగ్రిమం.
పురాణం జఠరం జీర్ణం ప్రాక్తనంచ చిరంతరమ్. ౧౫౫

టీ. ప్రత్యగ్రం, సాంప్రతం, నవ్యం, నవం, నూతనం, అగ్రిమం, ఈ ౬ ను క్రొత్తయైనదాని పేర్లు.

పురాణం, జఠరం, జీర్ణం, ప్రాక్తనం, చిరంతనం, ఈ ౫ ను ప్రాతయైనదాని పేర్లు.

మూ. భో రే హే హై హోచామంత్రే కచ్చి త్కించన సంశయే,
ద్రాక్ క్షణేఽహ్నాయ సపది నిషేధే మానఖల్వలమ్. ౧౫౬

టీ. భో, రే, హే, హై, హో, ఈ ౫ ను ఆమంత్రే = పిలుచుటయందు అనుటను పేర్లు.

కచ్చిత్, కించన, ఈ ౨ ను సంశయే = సందేహార్థమునం దనుటను పేర్లు.
ద్రాక్, అహ్నాయ, సపది, ఈ 3 ను క్షణే = శీఘ్రమునందనుటను పేర్లు.
మా, న, ఖలు, అలం, ఈ 3 ను నిషేధమం దనుటకుపేర్లు

మూ. ఉచ్చై రుచ్చావచం తుంగ ముచ్చ మున్నత ముచ్ఛ్రితం,
నీచం న్యగ్భవం కుబ్జం నీచైర్హ్రస్వ మధస్తరం, ౧౫౭

టీ. ఉచ్చైః, ఉచ్చావచం, తుంగం, ఉచ్చం, ఉన్నతం, ఉచ్ఛ్రితం, ఈ ౬ ను పొడుగైనదానిపేర్లు.

నీచం, న్యక్, ఆనతం, కుబ్జం, నీచైః, హ్రస్వం, ఈ ౬ ను అంతః = ఆపొడుగైనదానికి, పరం=వ్యతిరిక్తమైనది, అనఁగా పొట్టియైనదానిపేర్లు.

మూ. అమా సహ సమం సాకం సార్ధం సత్రా సజూ స్సమా,
సర్వదా సతతం నిత్యం శశ్వదాత్యంతికం సదా. ౧౫౪

టీ. అమా, సహ, సమం, సాకం, సార్థం, సత్రా, సజూః, సమా. ఈ ౮యును పైదానితోఁగూడ అనుటకు పేర్లు.

సర్వదా, సతతం, నిత్యం, శశ్వత్, ఆత్యంతికం, సదా, ఈ ౬ను ఎల్లప్పుడును అనుటపేర్లు.

మూ. వియోగో మదనావస్థా విరహోఽయల్లకే విదుః,
ప్రేమాఽభిలాష ఆలంభో రాగ స్స్నేహో హ్యతఃపరం. ౧౫౫

టీ. వియోగః, మదనావస్థా, విరహః, అయల్లకం, ఈ ౪ ను ఎడఁబాటు పేళ్ళని, విదుః=తెలిసికొందురు.

ప్రేమా, అభిలాషః, ఆలంభః, రాగః, స్నేహః, ఈ ౫ ను ప్రీతి పేర్లు.

మూ. సంహితం సహితం యుక్తం సంపృక్తం సంభృతం యుతం,
సంస్కృతం సమవేతం చ ప్రాహు రన్వితమిత్యపి. ౧౬౦

టీ. సంహితం, సహితం, యుక్తం, సంపృక్తం, సంభృతం, యుతం, సంస్కృతం, సమవేతం, అన్వితం, ఈ ౯ యు చేరియుండుదానిపేళ్ళని, ప్రాహుః=చెప్పుచున్నారు.

మూ. వర్త్మాధ్వా సరణిః పంథా మార్గ ప్రసర సంచరాః,

టీ. వర్త్మ, అధ్వా, సరణిః, పంథాః, మార్గః, ప్రసరః, సంచరః, ఈ ౭ను దారి పేర్లు.

మూ. త్రిమార్గ[illegible] ౧౬౧

టీ. త్రిమార్గనామగా-త్రి = త్రిశబ్దపూర్వమునందుఁగల, మార్గనామ=దారిపర్యాయ నామములతోఁజేరిన, గా = గమనార్థపర్యాయనామము, (అనఁగా, త్రిపథగా, త్రిపథగామినీ, త్రిమార్గగా, త్రిసరణిగా, ఇత్యాదులును)గంగా=భాగీరథియొక్క నామము లగుచున్నవి.

ఘోషః, గోమండలం, వ్రజః, ఈ 3 ను గొల్లపల్లె పేళ్లు.

మూ. శృంగీ ద్రుతహరి ర్నాథహరి స్తిర్యక్చ శృంగిణః,
గౌ శ్చతుష్పా త్పశు స్తత్ర మహిషీనామ దేయికా. ౧౬౨

టీ. శృంగీ, ద్రుతహరిః, నాథహరిః, తిర్యక్, ఈ ౪ ను శృంగిణః,=కొమ్ములుగల జంతువులకు పేళ్లు.

తత్ర = ఆకొమ్ములుఁగలజంతువులయందు, గౌః, చతుష్పాత్, పశుః, ఈ 3 ను గోవు పేళ్లు

దేయికా, ఈ ౧ యు మహిషీనామ=ఎనుము పేరు.

మూ. కృతీ నివిష్టో నిష్ణాతః కుశలో నిపుణః పటుః,
క్షుణ్ణః ప్రవీణః ప్రాగల్భ్యః కోవిదశ్చ విశారదః. ౧౬3
విదగ్ధ శ్చతురో ధూర్త శ్చాటుకృ త్కితవ శ్శఠః,
క్వాపి నాగరకో యోజ్యో గోత్రం సంజ్ఞాఽంకనామ తత్. ౧౬౪

టీ. కృతీ; నివిష్టః, నిష్ణాతః, కుశలః,నిపుణః; పటుః, క్షుణ్ణః, ప్రవీణః,ప్రాగల్భ్యః, కోవిదః, విశారదః, విదగ్ధః, చతురః, ఈ ౧3 ను ప్రౌఢుని పేళ్లు.

ధూర్తః, చాటుకృత్, కితవః, శఠః, ఈ ౪ ను ధూర్తుని పేళ్లు.

నాగరికః = నాగరకశబ్దము, క్వాపి=క్వచిత్తుగా, యోజ్యః = ప్రౌఢునినామముల యందుఁ జేర్పఁదగినది.

గోత్రం. సంజ్ఞా, ఈ ౨ను, తత్=ప్రసిద్ధమైన, అంకనామ=పెట్టినగుఱుతు పేరు.

మూ. వంశోఽన్వయోఽన్వవాయ స్సాన్వ దామ్నాయ స్సంతతిః కులం,
ఓఘో వర్గశ్చ సంతానః [illegible] ౧౬౫

టీ. వంశః. అన్వయః, అన్వవాయః, ఆమ్నాయః, సంతతిః, కులం, ఓఘః, వర్గః, సంతానః, ఈ ౯ యు వంశము పేర్లు.

కవిస్థితిః, కవి=కవి(వంశము) యొక్క, స్థితిః=ఉండుట, కావ్యఏవ=గ్రంథము నందే, స్యాత్=అగును. (అనఁగా—కవియొక్క వంశము కావ్యమునందే చెప్పఁ బడవలయును.

మూ. ముగ్ధో మూఢో జడో౽నేడో మూకో మూర్ఖశ్చ కద్వదః,
సదేవానాంప్రియో౽ప్రాజ్ఞో మందో౽ధీర్నామవర్జితః. ౧౬౬

టీ. ముగ్ధః, మూఢః, జడః, అనేడః, మూకః, మూర్ఖః, కద్వదః, దేవానాంప్రియః, అప్రాజ్ఞః, మందః, అధీః, నామవర్జితః, ఈ ౧౨ ను బుద్ధిహీనుని పేర్లు.

మూ. షాష్టికః కలమ శ్శాలి ర్వ్రీహి స్తంబకరి స్తథా,
వత్స శ్శకృత్కరి ర్జాతః షోడ షడ్దశనశ్చ సః. ౧౬౭

టీ. షాష్టికః, కలమః, శాలిః, వ్రీహిః, స్తంబకరిః, ఈ ౫ ను వడ్ల పేర్లు.

వత్సః, శకృత్కరిః, జాతః, ఈ ౩ ను లేదూడ పేర్లు.

షోడః=షోడశబ్దము, షడ్దశనః=ఆఱుపండ్లుగల, సః=ఆదూడపేరు. అనఁగా ఆఱుపండ్లదూడకు పేరు.

మూ. శౌండీరో గర్వితస్తబ్ధో మానీచా౽హంయు రుద్ధతః,
ఉద్గ్రీవో వృద్దశో దృప్తో నీచశ్చ పిశునో౽ధమః. ౧౬౮

టీ. శౌండీరః, గర్వితః, స్తబ్ధః, మానీ, అహంయుః, ఉద్ధతః, ఉద్గ్రీవః, ఉద్దశః, దృప్తః, ఈ ౯ యు అహంకారి పేర్లు.

నీచః, పిశునః, అధమః, ఈ ౩ ను తక్కువమనుష్యుని పేర్లు.

మూ. చోరైకాగారిక స్తేన స్తస్కరః ప్రతిరోధకః,
నిశాచరో గూఢచరో హారికః పారిపంథికః. ౧౬౯

టీ. చోరః, ఏకాగారికః, స్తేనః, తస్కరః, ప్రతిరోధకః, నిశాచరః, గూఢచరః, హారికః, పారిపంథికః, ఈ ౯ యు దొంగపేర్లు.

మూ. ప్రస్తరోపల పాషాణో దృష ద్ధాతు శ్శిలా ఘనః,
తత్ర జాత మయో లోహం శాతకుంభం చ హాటకమ్. ౧౭౦

టీ. ప్రస్తరః, ఉపలః, పాషాణః, దృషత్, ధాతుః, శిలా, ఘనః, ఈ ౭ ను ఱాయి పేళ్లు.

తత్ర = ఆఱాయిపర్యాయనామములతోఁ జేరిన, జాతం = ఉత్పత్తిపర్యాయ నామము, (అనఁగా, పాషాణజం, ప్రస్తరసవం, ఉపలోద్భవం, ఇత్యాదులును), అయః, లోహం, ఇవియును ఇనుము పేళ్లు.

శాతకుంభం, హాటకం, ఈ ౨ ను బంగారము పేళ్లు.

మూ. క్షామం శాంతం క్షితం క్షీణం హీనం జీర్ణంచ వై ఋణం,
సీర్ణం కీర్ణం మనస్యం చ ధైర్యం శౌర్యం చ పౌరుషమ్. ౧౭౧

టీ. క్షామం, శాంతం, క్షితం, క్షీణం, హీనం, జీర్ణం, ఋణం, ఈ ౭ ను తగ్గిపోయి నదాని పేళ్లు.

సీర్ణం, కీర్ణం, మనస్యం, ఈ 3 ను చల్లఁబడినదాని పేళ్లు.

ధైర్యం, శౌర్యం పౌరుషం, ఈ 3 ను పరాక్రమము పేళ్లు.

మూ. క్షిప్రా ఽఽశు మంక్ష్వరం శీఘ్రం సహసా ఝడితి ద్రుతం,
తూర్ణం జవ స్స్యదో రంహో రయో వేగ స్త్వరా లఘు. ౧౭౨

టీ. క్షిప్రం, ఆశు, మంక్షు, అరం, శీఘ్రం, సహసా, ఝడితి, ద్రుతం, తూర్ణం, జవః, స్యదః, రంహః, రయః, వేగః, త్వరా, లఘు, ఈ ౧౭ ను వేగము పేళ్లు.

మూ. సాధీయో ఽత్యర్థ మత్యంతం నితాంతం సుష్ఠు వై భృశం,
స్ఫుటం సాధు ఖలు స్పష్టం విశదం పుష్కలా ఽమలే. ౧౭3

టీ. సాధీయః, అత్యర్థః, అత్యంతం, నితాంతం, సుష్ఠు, భృశం, ఈ ౭ ను అధిక మైనదాని పేళ్లు.

స్ఫుటం, సాధు, ఖలు, స్పష్టం, విశదం, పుష్కలం, అమలం, ఈ ౭ ను వ్యక్తమైనదాని పేళ్లు.

మూ. చిత్రాఽశ్చర్యాద్భుతం చోద్యం విస్మయః కౌతుకోప్యహో,
అభియోగోద్యమోద్యోగా ఉత్సాహో విక్రమో మతః. ౧౭౪

టీ. చిత్రం, ఆశ్చర్యం, అద్భుతం, చోద్యం, విస్మయః, కౌతుకః, అహో, ఈ ౭యు ఆశ్చర్యము పేళ్లు.

అభియోగః, ఉద్యమః, ఉద్యోగః, ఉత్సాహః, విక్రమః, ఈ ౫ ను ప్రయత్నము పేళ్లు.

మూ. రహోఽనురహసోపాంశు రహస్యాని భిన్నక్తికః,
కీనాశః కృపణో లుబ్ధో గృధ్నుర్దీనోఽభిలాషుకః. ౧౭౫

టీ. రహః, అనురహసం, ఉపాంశు, రహస్యం, భిన్నక్తికః, ఈ ౫ ను ఏకాంతము పేళ్లు.

కీనాశః, కృపణః, లుబ్ధః, గృధ్నుః, దీనః, అభిలాషుకః, ఈ ౬ ను లోభి పేళ్లు.

మూ. ప్రాధ్వంకృత స్సితో బద్ధ స్సందానిత నియంత్రితౌ,
నియామిత శ్శృంఖలితః పినద్ధః, పాశిత స్తథా. ౧౭౬

టీ. ప్రాధ్వంకృతః, సితః, బద్ధః, సందానితః, నియంత్రితః, నియామితః, శృంఖలితః, పినద్ధః, పాశితం, ఈ ౯ యు కట్టఁబడినవాని పేళ్లు.

మూ. అవశ్యాయస్తుషారశ్చ ప్రాలేయం తుహినం హిమం,
నీహార స్తత్కరం విద్ధి మృగాంకం రోహిణీపతిం. ౧౭౭

టీ. అవశ్యాయః, తుషారః, ప్రాలేయం, తుహినం, హిమం, నీహారః, ఈ ౬ ను మంచు పేళ్లు.

రోహిణీపతిం, రోహిణీ=రోహిణీనక్షత్రమునకు, పతి = మగఁడైనచంద్రుని, మృగాంకం, మృగ = జింకపర్యాయనామములతో, అంకం = గుఱుతుపర్యాయనామములకు వాచ్యునిగాను, తత్కరం, తత్=ఆమంచుపర్యాయనామములతోఁ జేరిన, కరం = కిరణపర్యాయవాచ్యునిగాను, విద్ధి = తెలియుము. (అనఁగా, ప్రాలేయకరః, తుషారకరః, తుహినకరః, శిశిరకరః, హిమాంశుః, శీతభానుః, శిశిరదీధితిః, ఇత్యాదులును చంద్రునిపేళ్ళనుట.)

మూ. చారోపసర్పః ప్రణిధి ర్నిగూఢపురుష శ్చరః,
తదావ్యసు స్తస్సదా ప్రయ స్సన్వ్యర్థయుత సమ్మతే. ౧౭౮

టీ. చారః, ఉపసర్పః, ప్రణిధిః, నిగూఢపురుషః, చరః, ఈ ౫ ను వేగువాని పేర్లు. అనఁగా, నానాదేశసమాచారములను రహస్యముగా తెలిసికొని రాజున కెఱింగించు వాఁడు అనుట.

తద్వాన్ = ఆవేగువాఁడుగలరాజు, సహస్రాక్షః = సహస్రాక్షుఁడని, ఉక్తః = చెప్పఁబడుచున్నాఁడు.

ఋతం, సూనృతం, ఈ ౨ ను, సత్యార్థే = నిశ్చయము, లేక ప్రమాణము అను నర్థమునందు ప్రయోగింపఁబడుచున్నది.

మూ. నిస్తులం వర్తులం వృత్తం స్థపుటంవిషమోన్నతం,
దీర్ఘం ప్రాంశు విశాలంచ రుద్రంచ పృథులం పృథు. ౧౭౯

టీ. నిస్తులం, వర్తులం, వృత్తం, ఈ 3 ను వట్రువైనదానిపేర్లు. (అనఁగా, గుండ్రమైనది.)

స్థపుటం, విషమోన్నతం, ఈ ౨ ను నిమ్నోన్నతముపేర్లు. (అనఁగా మిట్టపల్లములేక, ఎగుడుదిగుడుపేర్లు).

దీర్ఘం, ప్రాంశు, ఈ ౨ ను నిడివైనదాని పేర్లు.

విశాలం, రుంద్రం, పృథులం, పృథు, ఈ ౪ ను వెడలుపైనదాని పేర్లు.

మూ. ఉల్బణం దారుణం తిగ్మం ఘోరం తీవ్రోగ్ర ముష్ణకం,
శీతకం స్తిమితం మందం యాప్యం విద్ధి విలంబితం. ౧౮౦

టీ. ఉల్బణం, దారుణం, తిగ్మం, ఘోరం, తీవ్రం, ఉగ్రం, ఉష్ణకం, ఈ ౭ ను వేఁడిమి పేర్లు.

శీతకం, స్తిమితం, మందం, యాప్యం, ఈ ౪ ను విలంబితం=ఆలస్యమైనదాని పేర్లుగా, విద్ధి = తెలియుము.

మూ. స్వభావః ప్రకృతి శ్శీలం నిసర్గో విస్రసా నిజం,
యోగ్యో గుణీ కృతాభ్యాస స్స్యాదాభీక్ష్ణ్యం ముహుర్ముహుః.

టీ. స్వభావః, ప్రకృతిః, శీలం, నిసర్గః, విస్రసా, నిజం, ఈ౬ను సహజరీతికి పేర్లు.

యోగ్యః, గుణీ, కృతాభ్యాసః, ఈ 3 ను విద్యావ్యాసంగముచేసి మంచినడతనుబొందిన వానిపేర్లుగా, స్యాత్ = అగుచున్నది.

అభీక్ష్ణ్యం, ముహుర్ముహుః= ఈ ౨ ను మాటిమాటికి అనుటకు పేర్లు.

మూ. మృషాఽలీకం ముధా మోఘంవిఫలం వితథం వృథా,
విధురం వ్యసనం కష్టం కృచ్ఛ్రం గహన ముచ్యతే. ౧౮౨

టీ. మృషా. అలీకం. ముధా, మోఘం, విఫలం, వితథం, వృథా, ఈ ౭ ను ప్రయోజనములేనిదాని పేళ్లు.
విధురం, వ్యసనం, కష్టం, కృచ్ఛ్రం, గహనం, ఈ ౫ ను కష్టము పేళ్లుగా ఉచ్చరేత్ = చెప్పవలయును.

మూ. సమస్తం సకలం సర్వం కృత్స్నం విశ్వం తథాఽఖిలం,
శకలం వికలం ఖండం శల్కం లేశం లవం విదుః. ౧౮౩

టీ. సమస్తం, సకలం, సర్వం, కృత్స్నం, విశ్వం, అఖిలం; ఈ ౬ ను అంతయు అనుటకు పేర్లు.
శకలం, వికలం, ఖండం, శల్కం, లేశం, లవం, ఈ ౬ ను తునుక పేర్లుగా, విదుః = తెలియుదురు.

మూ. వర్మ కోశంచ కలహః పరివాదం ఛలం భవేత్,
లోహితం శోణితం రక్తం రుధిర క్షతజా సృజః. ౧౮౪

టీ. వర్మ, కోశం, ఈ ౨ ను, కత్తి మొదలగువాని ఒర పేర్లు.
కలహః, పరివాదం, ఈ ౨ ను, ఛలం = హఠవాచకములుగా, భవేత్ = ఆగును.
లోహితం, శోణితం, రక్తం, రుధిరం, క్షతజం, అసృక్, ఈ ౬ ను నెత్తురు పేర్లు.

మూ. నిత్యానవరతాఽజస్ర మథ కన్యాపతి ర్వరః,
ఉద్వాహోపయమా చైవ వివాహశ్చ నివేశనమ్. ౧౮౫

టీ. నిత్యం, అనవరతం, అజస్రం, ఈ ౩ ను ఎల్లప్పుడనుటకు పేర్లు.
కన్యాపతిః, వరః ఈ ౨ ను పెండ్లికొడుకు పేర్లు.
ఉద్వాహః, ఉపయమః, వివాహః, నివేశనం, ఈ ౪ ను పెండ్లి పేర్లు.

మూ. సుషిరం వివరం రంధ్రం ఛింద్రం గర్తంచ గహ్వరం,
శ్వభ్రం రసాచ పాతాళం నరకం యాంత్యమేధసః. ౧౮౬

టీ. సుషిరం, వివరం, రంధ్రం, ఛిద్రం, గర్తం, గహ్వరం, శ్వభ్రం, ఈ ౭ ను భూమియందలి బొరియ పేర్లు.
రసా, పాతాళం, ఈ ౨ ను నాగలోకము పేర్లు.
అమేధసః = బుద్ధి[illegible] యాంతి = పొందుదురు.

మూ. అదభ్రం భూరి భూయిష్ఠం బర్హిష్ఠం బహుళం బహు,
ప్రచురం నైక మానంత్యం త్యజే జ్జన్మాఽజవం జవః. ౧౮౭
భావో భవశ్చ సంసార స్సంసరణ్యాంచ సంసృతిః,

టీ. అదభ్రం, భూరి, భూయిష్ఠం, బర్హిష్ఠం, బహుళం, బహు, ప్రచురం, నైకం, ఆనంత్యం, ఈ ౯యు అధికము పేర్లు. త్యజేత్ =అధికమైనదానిని విడువవలయును. జన్మ, ఆజవంజవః, భావః, భవః, సంసారః, సంసరణ్యాం, సంసృతిః, ఈ ౭ ను సంసారము పేర్లు.

మూ. తత్త్వజ్ఞ శ్చతురో ధీర స్త్యజే జ్జన్మాజవంజవం. ౧౮౮

టీ. తత్త్వజ్ఞః, హేయోపాదేయ తత్త్వస్వరూపములను దెలిసిన, చతురః = సమర్థుఁడగు, ధీరః = పండితుఁడైనవాఁడు, జన్మాజవంజవం, జన్మ=పునరుత్పత్తికి కారణభూతమైన, ఆజవంజవం= సంసారమును, త్యజేత్ =పరిత్యాగముచేయవలయును.

మూ. ఓజ స్వ్యూర్జస్వి తేజస్వి మనస్వి చతురా అపి,
భాస్వరో భాసుర శ్శూరః ప్రవీణ స్సుభటో మతః. ౧౮౯

టీ. ఓజస్వీ, ఊర్జస్వీ, తేజస్వీ, మనస్వీ, చతురః, భాస్వరః, భాసురః, శూరః, ప్రవీణః ఈ ౯ శబ్దములకును, సుభటః=మిక్కిలిశూరుఁడు, వాచ్యుఁడుగా, మతః =ఒప్పఁబడినవాఁడు, (అనఁగా, ఈ ౯ యు శూరుని పేర్లు.

మూ. తనుత్రం వర్మ కవచ మావృతి ర్బాణవారణం,
కూర్పాస కంచుకౌ ఛత్ర మాతపత్త్రోష్ణవారణమ్ ౧౯౦

టీ. తనుత్రం, వర్మ, కవచం, ఆవృతిః, బాణవారణం, ఈ ౫ ను యుద్ధమునందు తొడుగు ఉక్కుజిరా పేర్లు.
కూర్పాసః, కంచుకః, ఈ ౨ ను చొక్కాయి, లేక రవికె పేర్లు.
ఛత్రం, ఆతపత్త్రం, ఉష్ణవారణం, ఈ 3 ను గొడుగు పేర్లు.

మూ. కేశ శ్శిరోరుహో వాలః కచ శ్చికుర ఈడితః,
చూడా ... ధమ్మిల్లః ... ౧౯౧

టీ. కేశః, శిరోరుహః, వాలః, కచః, చికురః, ఈ ౫ ను కురులపేళ్లుగా, ఈడి తః=చెప్పబడుచున్నది.

చూడాపాశః,ధమ్మిల్లః, కబరీ, కేశబంధనం, ఈ ౪ను కొప్పుపేళ్లు. లేక,కీల్గం టు పేళ్లు.

మూ. ఉరరీకృత మప్యూరీ కృత మంగీకృతం తథా,
అస్తుకారో౽భ్యుపగమే సత్యంకారః పణార్పణే. ౯౯-౨

టీ. ఉరరీకృతం, ఊరీకృతం, అంగీకృతం, అస్తుకారః, ఈ ౪ ను, అభ్యుపగమే= ఒడంబడుటయందు వర్తించుచున్నవి.

సత్యంకారః=ఈశబ్దము, పణార్పణే=పందెముకట్టుటయందు వర్తించుచున్నది.

మూ. అత్యంతాయ చిరాయేతి ప్రాహ్ణో౽కస్మాద్బలాదితి,
ప్రాయేణోచ్చైః కృతం చేతి విభక్తి ప్రతిరూపకాః. ౯౯-౩

టీ. అత్యంతాయ, చిరాయ, ఈ ౨ ను చాలకాలమునకుపేళ్లు.
ప్రాహ్ణే, ఇది పూర్వాహ్ణమునకు పేరు.
అకస్మాత్, ఇది హఠాత్తు అనుటకుపేరు.
బలాత్, ఇది బలాత్కారమునకు పేరు.
ప్రాయేణ, ఇది బహుళముగా అనుటకు పేరు.
ఉచ్చైః, ఇది అధికముగా అనుటకు పేరు.
కృతం, ఇదిచాలు ననుటకు పేరు.



విభక్తి ప్రతిరూపకాః=ఈఅత్యంతాది యెనిమిది శబ్దములును విభక్తులుగల శబ్ద ములవలె తోచునట్టి అవ్యయములు.

మూ. సౌహార్దం సౌహృదం హార్దం సౌహృత్యం సౌఖ్య సౌరభం,
మైత్రీ మైత్రేయికా౽జర్యం సహాయం సంగతం మతమ్. ౯౯-౪

టీ. సౌహార్దం, సౌహృదం, హార్దం, సౌహృత్యం, సౌఖ్యం, సౌరభం, మైత్రీ, మైత్రేయికా, అజర్యం, సహాయం, సంగతం, ౧౧ ను స్నేహముపేళ్లుగా, మతం =సమ్మతమైనది.

మూ. కాంతంచకమనంకమ్రం కమనీయం మనోహరం,
అభిరామం రామణీయం రమ్యం సౌమ్యంచ సుందరమ్. ౧౯౫
చారు శ్లక్ష్ణంచ రుచిరం ప్రశస్తం హృద్యబంధురే,
దర్శనీయం మనోజ్ఞంచ చిత్తపర్యాయహారిచ. ౧౯౬

టీ. కాంతం, కమనం, కమ్రం, కమనీయం, మనోహరం, అభిరామం, రామణీయం, రమ్యం, సౌమ్యం, సుందరం, చారు, శ్లక్ష్ణం, రుచిరం, ప్రశస్తం, హృద్యం, బంధురం, దర్శనీయం, మనోజ్ఞం, ఈ ౧౮ యును, చిత్తపర్యాయహారిచ, చిత్త = మనస్సుయొక్క, పర్యాయ=సామాన్యనామములతోఁజేరిన, హారిచ=హారిశబ్దమును, (అనఁగా, మనోహారి, చిత్తహారి, హృదయహారి, మానసహారి, చేతోహారి, ఇత్యాదులును,) రమ్యమైనది అనుటకు పేర్లు.

మూ. కామనీయక సౌందర్యం రమ్యతా రామణీయకం,
క్షేమం కల్యాణ మభయం శుభం భద్రంచ మంగళం. ౧౯౭
భావుకం భవుకం భవ్యం సోవసేయం శివం తథా,
వర్యం కల్యాణమధురం పరం శ్రేష్ఠంచ పేశలమ్. ౧౯౮

టీ. కామనీయకం, సౌందర్యం, రమ్యతా, రామణీయకం, ఈ ౪ ను సౌందర్యముపేర్లు.

క్షేమం, కల్యాణం, అభయం, శుభం, భద్రం, మంగళం, భావుకం, భవుకం, భవ్యం, సోవసేయం, శివం, ఈ ౧౧ ను శుభము పేర్లు.

వర్యం, కల్యాణమధురం, పరం, శ్రేష్ఠం, పేశలం, ఈ ౫ ను శ్రేష్ఠము పేర్లు.

ఇతి ధనంజయనిఘంటౌ సంకీర్ణశబ్దనిరూపణంనామ
ప్రథమః పరిచ్ఛేదః.

ఇది ధనంజయనిఘంటువునందు మొదటి సంకీర్ణశబ్దనిరూపణంబను
మొదటిపరిచ్ఛేదము.

---

శ్రీరస్తు.

# ధ న ం జ య ని ఘ ం టు వు.

---

## ద్వితీయ పరిచ్ఛేదము.

## (నానార్థపరిచ్ఛేదము.)

మూ. గంభీరం రుచిరం చిత్రం విస్తీర్ణార్థప్రసాధకం,
శబ్దం మనాక్ప్రవక్ష్యామి కవీనాం హితకామ్యయా. ౧

టీ. గంభీరం=గంభీరమై, రుచిరం=మనోహరమై, చిత్రం=ఆశ్చర్యప్రదమై, విస్తీర్ణార్థప్రసాధకం, విస్తీర్ణ = విస్తారములగు, అర్థ = అభిధేయములకు, ప్రసాధకం = అధికసహాయమైన, శబ్దం=నానార్థశబ్దమును, కవీనాం = కవులకు, హితకామ్యయా, హిత=అనుకూల్యమునందు, కామ్యయా=అపేక్షచేత, మనాక్ = సంక్షేపముగా, ప్రవక్ష్యామి=చెప్పుచున్నాఁడను.

మూ. అర్హాత్పినాకినౌ శంభూ జినా వర్హాత్తథాగతౌ,
దేవసూర్యౌ వివస్వంతౌ విష్ణుసూర్యౌ వృషాకపీ. ౨

టీ. అర్హాత్పినాకినౌ, అర్హాత్=జినేశ్వరుఁడును, పినాకినౌ=శివుఁడును, శంభూ=శంభుశబ్దవాచ్యులు.

అర్హాత్తథాగతౌ, అర్హాత్=జినేశ్వరుఁడును, తథాగతౌ=బుద్ధదేవుఁడును, జినౌ=జినశబ్దవాచ్యులు.

దేవసూర్యౌ, దేవ=దేవుఁడును, సూర్యౌ=సూర్యుఁడును, వివస్వంతౌ=వివస్వచ్ఛబ్దవాచ్యులు.

విష్ణురుద్రౌ, విష్ణు=నారాయణుఁడును, రుద్రౌ=శివుఁడును, వృషాకపీ=వృషాకపిశబ్దవాచ్యులు (అగుచున్నారు.)

మూ. వైకుంఠా వింద్రగోవిందా వసంతౌ శేషశార్ఙ్గిణౌ,
జీమూతౌ శక్రపుత్త్రౌ పర్వతావ్ శక్రవారిదౌ. 3

టీ. ఇంద్రగోవిందౌ, ఇంద్ర=ఇంద్రుఁడును, గోవిందౌ=నారాయణుఁడును, అనంతౌ =అనంతశబ్దవాచ్యులు.

కరికుక్షిలౌ, కరి=ఏనుఁగు, కుక్షిలౌ=కొండయు, జీమూతౌ=జీమూతపద వాచ్యులు.

శక్రవారిదౌ, శక్ర=ఇంద్రుఁడును, వారిదౌ=మేఘమును, పర్జన్యౌ=పర్జన్యశబ్దవాచ్యులు, (అగుచున్నారు.)

మూ. వన మంభసి కాంతారే భువనం విష్టపేఽర్ణసి,
ఘృతం సర్పిషి పానీయే విషం హాలాహలే జలే. ౪

టీ. వనం = వనమనుశబ్దము, అంభసి = ఉదకమునందును, కాంతారే = అడవియందును,

భువనం=భువన మనుశబ్దము, విష్టపే=లోకమునందును, అర్ణసి=ఉదకమునందును, ఘృతం=ఘృతమనుశబ్దము, సర్పిషి= నేతియందును, పానీయే=జలమునందును, విషం =విషమనుశబ్దము, హాలాహలే=వత్సనాభియందును, జలే=నీటియందును, (వర్తించును).

మూ. తల్పం దారేషు శయ్యాయాం జ్యోతి శ్చక్షుషి తారకే,
ధవళే సుందరే రామో వామో వక్రే మనోహరే. ౫

టీ. తల్పం=తల్ప మనుశబ్దము, దారేషు=భార్యయందును, శయ్యాయాం=పఱుపునందును,

జ్యోతిః = జ్యోతిశ్శబ్దము, చక్షుషి=నేత్రమునందును, తారకే = నక్షత్రమునందును, రామః=రామశబ్దము, ధవళే=తెలుపైనదానియందును, సుందరే=సొగసైనదానియందును,

వామః=వామశబ్దము, వక్రే=వంకరదైనదానియందును, మనోహరే=రమ్యమైనదానియందును, (వర్తించును).

మూ. నక్షత్రే మందిరే ధిష్ణ్యం వసనే గగనేఽంబరం,
శరీరం పాదపే సాలః కుల్యా స్రోతసి యోషితి. ౬

టీ. ధిష్ణ్యం=ధిష్ణ్య మనుశబ్దము, నక్షత్రే = నక్షత్రమునందును, మందిరే=ఇంటియందును,

అంబరం=అంబర మనుశబ్దము, వసనే=గుడ్డయందును, గగనే=ఆకాశమునందును,
సాలః=సాలశబ్దము, పరిఘా=కోటయందును, పాదపే = వృక్షమునందును,
కుల్యా=కుల్యాశబ్దము, స్రోతసి=కాలువయందును, యోషితి=కులస్త్రీయందును,
(వర్తించును).

మూ. సారస శ్శకునౌ ధూర్తే కేతనం దీధితౌ ధ్వజే,
మయూఖః కిరణే దీప్తౌ పతంగ శ్శలభే రవౌ. ౭

టీ. సారసః=సారసశబ్దము, శకునౌ=పక్షివిశేషమునందును, (బెగ్గురుపక్షి) ధూర్తే=దుష్టునియందును,

కేతనం=కేతనశబ్దము, దీధితౌ=కాంతియందును, ధ్వజేః=టెక్కెమునందును,
మయూఖః=మయూఖమనుశబ్దము, కిరణే=కలయందును, దీప్తౌ=కాంతియందును,
పతంగః=పతంగశబ్దము = శలభే=మిడుతయందును, రవౌ=సూర్యునియందును,
(వర్తించును).

మూ. అంజనః కజ్జలే నాగే సారంగే పృషతే గజే,
సరళః ప్రగుణే వృక్షే పున్నాగ స్సన్న రేతరౌ. ౮

టీ. అంజనః = అంజనశబ్దము, కజ్జలే = కాటుకయందును, నాగే = పశ్చిమదిగ్గజమునందును;

సారంగే=సారంగశబ్దము, పృషతే= జింకయందును, గజే = ఏనుగునందును;
సరళః=సరళశబ్దము, ప్రగుణే=సుగుణముగలదానియందును, వృక్షే=దేవదారువృక్షమునందును;

పున్నాగః=పున్నాగశబ్దము, సన్నరే=పురుషశ్రేష్ఠునియందును, తరౌ=సురపొన్నవృక్షమునందును (వర్తించును).

మూ. పాంచజన్యోఽనలేశంఖే కంబు శ్శంఖే మతంగజే,
కస్వరో దున్దుభనే దున్దుమ్మే స్పందన శ్శుక్తే... ౯

టీ. పాంచజన్యః=పాంచజన్యశబ్దము, అనలే=అగ్నియందును, శంఖే=విష్ణుదేవుని యొక్క మురిశంఖమునందును ;

కంబుః=కంబుశబ్దము, శంఖే=సంకువునందును, మతంగజే=ఏనుఁగునందును; కస్వరః=కస్వరిశబ్దము, ద్యుభవే = స్వర్గమందుకలిగినవస్తువునందును, ద్యుమ్నే=బంగారమునందును ;

స్యందనః = స్యందనశబ్దము, శకటే=బండియందును, అంబుని = ఉదకమందును (వర్తించును).

మూ. అద్రి ర్గిరి వనస్పత్యో శ్శిఖరీ తరుభూధ్రయోః,
రాజా చంద్ర మహీపత్యో ర్ద్విజో దశన విప్రయోః. ౧౦

టీ. అద్రిః = అద్రిశబ్దము, గిరివనస్పత్యోః, గిరి = కొండయందును, వనస్పత్యోః= వృక్షమునందును;

శిఖరీ=శిఖరిన్శబ్దము, తరుభూధ్రయోః, తరు= చెట్టునందును, భూధ్రయోః= కొండయందును;

రాజా=రాజన్ శబ్దము, చంద్రమహీపత్యోః, చంద్ర = చంద్రునియందును, మహీపత్యోః=ప్రభువునందును;

ద్విజః=ద్విజశబ్దము, దశనవిప్రయోః, దశన = పంటియందును, విప్రయోః= బ్రహ్మ క్షత్త్రియ వైశ్యులయందును (వర్తించును).

మూ. మోచాఽమరస్త్రియో రంభా కదలీ ధ్వజ మోచయోః,
అశోక స్సుమన స్తర్వో స్సుమనా స్సురపుష్పయోః. ౧౧

టీ. రంభా = రంభాశబ్దము, మోచామరస్త్రియోః, మోచా = అరఁటిచెట్టునందును, అమరస్త్రియోః = దేవలోకమందుండు రంభయనెడు అప్సరస్త్రీయందును; కదలీ = కదలీశబ్దము, ధ్వజమోచయోః, ధ్వజ = టెక్కెమునందును, మోచయోః = అరఁటిచెట్టునందును ;

అశోకః = అశోకశబ్దము, సుమన స్తర్వోః, సుమనః = పుష్పమునందును, తర్వోః = వృక్షవిశేషమునందును;

సుమనాః = సుమనశ్శబ్దము, సురపుష్పయోః, సుర = దేవతలయందును, పుష్పయోః = పుష్పమునందును (వర్తించును).

మూ. ముక్తారజతయో స్తారో భూరిభూయస్సువర్ణయోః,
పానీయదుగ్ధయోః క్షీరం పయస్సలిలదుగ్ధయోః. ౧౨

టీ. తారః = తారశబ్దము, ముక్తారజతయోః, ముక్తా=ముత్తెమునందును, రజతయోః= వెండియందును ;

భూరి, భూరిశబ్దము, భూయస్సువర్ణయోః, భూయః=ఆధిక్యమునందును, సువర్ణయోః = బంగారమునందును;

క్షీరం = క్షీరశబ్దము, పానీయదుగ్ధయోః, పానీయ = నీటియందును, దుగ్ధయోః = పాలునందును;

పయః = పయశ్శబ్దము, సలిలదుగ్ధయోః, సలిల=జలమునందును, దుగ్ధయోః = పాలునందును (వర్తించును.)

మూ. కాలప్రకర్షయోః కాష్ఠా కోటి స్సంఖ్యాప్రకృష్టయోః,
రంధ్రసంశ్లేషయో స్సంధి స్సింధు ర్నదసముద్రయోః. ౧౩

టీ. కాష్ఠా=కాష్ఠాశబ్దము, కాలప్రకర్షయోః, కాల = పదాఱుకళలకాలమందును, ప్రకర్షయోః=ఆధిక్యమునందును;

కోటిః = కోటిశబ్దము, సంఖ్యాప్రకృష్టయోః, సంఖ్యా = ఎన్నికయందును, ప్రకృష్టయోః=ఆధిక్యమునందును;

సంధిః=సంధిశబ్దము, రంధ్రసంశ్లేషయోః, రంధ్ర = బెజ్జమునందును. సంశ్లేషయోః=హెచ్చుగాఁగూడుటయందును;

సింధుః=సింధుశబ్దము, నదసముద్రయోః, నద=పడమటఁబాఱునదియందును, సముద్రయోః=సముద్రమునందును, (వర్తించును).

మూ. నిషేధదుఃఖయో ర్బాధా వ్యామోహో మూర్ఖమూఢయోః,
కౌపీనాఽకార్యయో ర్గుహ్యం కీలాలం రుధిరాఽంభసోః. ౧౪

టీ. బాధా=బాధాశబ్దము, నిషేధదుఃఖయోః, నిషేధ=తిరస్కారమునందును, దుఃఖయోః=వ్యసనమునందును,

వ్యామోహః = వ్యామోహశబ్దము, మూర్ఖ్యమౌఢ్యయోః, మూర్ఖ్య = వాతవాదమునందును, మౌఢ్యయోః=బుద్ధిహీనతయందును;

గుహ్యం=గుహ్యమనుశబ్దము, కౌపీనాఽకార్యయోః, కౌపీన=గోచియందును, అకార్యయోః=చేయరానికార్యమునందును;

కీలాలం=కీలాలశబ్దము, రుధిరాఽంభసోః, రుధిర= నెత్తుటియందును, అంభసోః=నీటియందును, (వర్తించును).

మూ. మూల్యసత్కారయో రర్ఘో జాత శ్శ్రేష్ఠకులీనయోః,
మేఘవత్సరయో రబ్ద స్తార్క్ష్యో హయగరుత్మతోః. ౧౫

టీ. అర్ఘః = అర్ఘశబ్దము, మూల్యసత్కారయోః, మూల్య = వెలయందును, సత్కారయోః=పూజయందును,

జాత్యః=జాత్యశబ్దము, శ్రేష్ఠకులీనయోః, శ్రేష్ఠ=ఉత్తమునియందును, కులీనయోః సద్వంశమునఁ బుట్టినవానియందును,

అబ్దః=అబ్దశబ్దము, మేఘవత్సరయోః, మేఘ=మబ్బునందును, వత్సరయోః = సంవత్సరమునందును,

తార్క్ష్యః=తార్క్ష్యశబ్దము, హయగరుత్మతోః, హయ = గుఱ్ఱమునందును, గరుత్మతోః=గరుడునియందును, (వర్తించును).

మూ. స్తబ్ధతాస్థూణయో స్తంభ శ్చర్చాచింతావితర్కయోః,
హరకీలకయో స్థాణు స్స్వైరస్స్వచ్ఛందమాంద్యయోః. ౧౬

టీ. స్తంభః = స్తంభశబ్దము, స్తబ్ధతాస్థూణయోః, స్తబ్ధతా = నిశ్చలత్వమునందును, స్థూణయోః=కంబమునందును,

చర్చా=చర్చాశబ్దము, చింతావితర్కయోః, చింతా=విచారించుటయందును, వితర్కయోః=ఊహించుటయందును,

స్థాణుః=స్థాణుశబ్దము, హరకీలకయోః, హర = రుద్రునియందును, కీలకయోః =మ్రానిమేకునందును,

స్వైరః = స్వైరశబ్దము, స్వచ్ఛందమాంద్యయోః, స్వచ్ఛంద=స్వేచ్ఛాసంచారమునందును, మాంద్యయోః = జడత్వమునందును, (వర్తించును).

మూ. శంకు స్సుకీర్ణవివరే పలాశేఽగ్నౌచ కీలకే,
కానసే కానసోద్భూత వహ్నౌ దావోదవోపి చ. ౧౭

టీ. శంకుః=శంకుశబ్దము, సుకీర్ణవివరే, సుకీర్ణ=మూఁతవేయఁబడిన, వివరే=బొక్కయందును, పలాశే=ఆకునందును, అగ్నౌ=అగ్నియందును, కీలకేచ=మేకునందును, (వర్తిం

చును).

దావః, దవః, ఈరెండుశబ్దములు, కాననే = అడవియందును, కాననోద్భూత వహ్నౌ, కాననోద్భూత = అడవియందు పుట్టిన, వహ్నౌ = అగ్నియందును, (వర్తించును.)

మూ. కీనాశః కృపణే భృత్యే కృతాంతే పిశితాశనే,
తథా పుణ్యజనాన్ ప్రాహు స్సజ్జనాన్ రాక్షసా నపి. ౧౮

టీ. కీనాశః=కీనాశశబ్దము, కృపణే = లోభియందును, భృత్యే = సేవకునియందును, కృతాంతే = యమునియందును, పిశితాశనే = రాక్షసునియందును, (వర్తించుచున్నది).

తథా = ఆప్రకారముగనే, సజ్జనాన్=సత్పురుషులను, రాక్షసానపి = రాక్షసులను, పుణ్యజనాన్ = పుణ్యజనవాచ్యులనుగా, ప్రాహుః = (పండితులు) చెప్పుచున్నారు.

మూ. విరోచనో రవౌచంద్రే దితిసూనౌ హుతాశనే,
హంసో నారాయణే బ్రహ్మే యతావశ్వేసితచ్ఛదే. ౧౯

టీ. విరోచనః = విరోచనశబ్దము, రవౌ = సూర్యునియందును, చంద్రే = చంద్రుని యందును, దితిసూనౌ = దైత్యునియందును, (అనఁగా, ప్రహ్లాదుని మనుమని యందును) హుతాశనే=అగ్నియందును, (వర్తించుచున్నది).

హంసః =హంసశబ్దము, నారాయణే=విష్ణువునందును, బ్రహ్మే= బ్రహ్మదేవుని యందును, యతౌ = సన్న్యాసియందును, అశ్వే = గుఱ్ఱమునందును, సితచ్ఛదే= హంసపక్షియందును, (వర్తించుచున్నది).

మూ. సోమశ్చంద్రోఽమృతంసోమం సోమోరాజాయుగాధిభూః,
సోమఃప్రతానసీభేద స్సోమః పౌలస్త్యదిక్పతిః. ౨౦

టీ. చంద్రః = పచ్చకర్పూరమును, యుగాధిభూః=చతుర్యుగాధిపతియును, రాజా =చంద్రుఁడును, ప్రతానసీభేదః = లతావిశేషమును, (అనఁగా, తిప్పతీఁగెయు ను,) పౌలస్త్యదిక్పతిః, పౌలస్త్య = పులస్త్యబ్రహ్మకుమారుఁడైన, దిక్పతిః =దిక్పాలకుఁడైన కుబేరుఁడును పుంలింగసోమశబ్దవాచ్యులు ; (అనుచున్నారు.) అమృతం = సుధ, నపుంసకలింగసోమపదవాచ్యమగుచున్నది.

మూ. అజో విధి రజో విష్ణు రజ శ్శంభు రజ స్త్వజః,
అజ స్త్రివార్షికో వ్రీహి రజో రామపితామహః. ౨౧

టీ. విధిః = బ్రహ్మయును, విష్ణుః = నారాయణుఁడును; శంభుః = రుద్రుఁడును, అజం = మేకయును, త్రివార్షికః = మూఁడుసంవత్సరములకు ఫలముకాఁదగిన, వ్రీహిః = ధాన్యమును, రామపితామహః = శ్రీరామునితాతయైన అజమహారాజును, అజః = అజశబ్దవాచ్యు లగుచున్నారు.

మూ. శుద్ధేఽనుపహతే వహ్నౌ బ్రాహ్మణే సచివోత్తమే,
ఆషాఢేఽధ్యాత్మసంవిత్తౌ బ్రహ్మచర్యే శుచి ర్మతః. ౨౨

టీ. శుద్ధే = పరిశుద్ధమైనదానియందును, అనుపహతే = చెడుపులేనిదానియందును, వహ్నౌ = అగ్నియందును, బ్రాహ్మణే = బ్రహ్మజ్ఞానియందును, సచివోత్తమే = మంత్రిశ్రేష్ఠునియందును, ఆషాఢే = ఆషాఢమాసమునందును, అధ్యాత్మసంవిత్తౌ = బ్రహ్మజ్ఞానమునందును, బ్రహ్మచర్యే = వేదాధ్యయనవ్రతమునందును, శుచిః=శుచిశబ్దము, మతః=సమ్మతింపఁబడినది.

మూ. అర్థోఽభిధేయ రై వస్తు ప్రయోజననివృత్తిషు,
భావః పదార్థచేష్టాత్మ సత్తాభిప్రాయజన్మసు. ౨౩

టీ. అర్థః = అర్థశబ్దము, అభిధేయరైవస్తుప్రయోజననివృత్తిషు, అభిధేయ = శబ్దముల అర్థమునందును, రై = ధనమునందును, వస్తు = పదార్థమునందును, ప్రయోజన = ఉపయోగమునందును, నివృత్తిషు = తుదముట్టచేయుటయందును (వర్తించుచున్నది)

భావః = భావశబ్దము పదార్థచేష్టాత్మసత్తాభిప్రాయజన్మసు, పదార్థ = శబ్దముల అర్థమునందును, చేష్టా = విలాసమునందును, ఆత్మ = మనస్సునందును, సత్తా = స్థితియందును, అభిప్రాయ = మనస్తాత్పర్యమునందును, జన్మసు = ఉత్పత్తియందును, (వర్తించుచున్నది).

మూ. ప్రాయో భూమ్న్యుపమా శర్కల్య ప్రభూత్యన్ననివృత్తిషు,
అంతే పదార్థసామీప్యే ధర్మస్త్వవినివృత్తిషు. ౨౪

టీ. ప్రాయః = ప్రాయశ్శబ్దము, భూమ్న్యుపమాతర్క్యప్రభూత్యన్ననివృత్తిషు-భూమ్ని=అధిక్యమునందును, ఉపమా=సామ్యమునందును, అతిర్క్య=ఊహింప విషయముకానిదానియందును, ప్రభూతి=అతిసంపత్తునందును, అన్ననివృత్తిషు = అనశనవ్రతమునందును, (వర్తించుచున్నది).

అంతః=అంతశ్శబ్దము, పదార్థసామీప్యధర్మసత్త్వనివృత్తిషు - పదార్థ=వస్తువులయొక్క, సామీప్య = సమీపప్రదేశమునందును, ధర్మ = మరణమునందును, సత్త్వనివృత్తిషు=బలముతగ్గుటయందును, (వర్తించుచున్నది).

మూ. అక్షో ద్యూతే వరూథాంగే నయనాదౌ విభీతకే,
సార శ్శ్రేష్ఠే బలే విత్తే క్లేశే జలచరే స్థిరే. ౨౫

టీ. అక్షః=అక్షశబ్దము, ద్యూతే, =జూదమునందును, వరూథాంగే=రథముయొక్క ఇరుసునందును, నయనాదౌ, నయన=నేత్రిము, ఆదౌ=మొదలగుఇంద్రియముల యందును, విభీతకే = తాండ్రచెట్టునందును, (వర్తించుచున్నది). సారః=సారశబ్దము, శ్రేష్ఠే= ఉత్కృష్టమైనదానియందును, బలే=శక్తియందును, విత్తే=ద్రవ్యమునందును, క్లేశే = కష్టమునందును, జలచరే=జలజంతువునందును, స్థిరే=శాశ్వతమైనదానియందును, (వర్తించుచున్నది).

మూ. ప్రధానశృంగలాంగూల భూషాపుండ్రప్రభావనా,
ధ్వజలక్ష్మతురంగేషు లలామో నవసు స్మృతః. ౨౬

టీ. లలామః=లలామశబ్దము, నవసు=తొమ్మిదైన, ప్రధానశృంగలాంగూలభూషాపుండ్రప్రభావనాధ్వజలక్ష్మతురంగేషు-ప్రధాన = ముఖ్యమైనదానియందును, శృంగ = కొమ్మునందును,లాంగూల=తోకయందును,భూషా=అభరణమునందును, పుండ్ర= తిలకమునందును, ప్రభావనా = పూజ్యతయందును, ధ్వజ = టెక్కెమునందును, లక్ష్మ=చిహ్నమునందును, తురంగేషు=గుఱ్ఱమునందును, (వర్తించుచున్నది).

మూ. వాచి వారి పశౌ భూమౌ దిశి లోమ్ని పవౌ దివి,
విశిఖే దీధితౌ దృష్టౌ వేకాదశసు గౌ స్మృతః. ౨౭

టీ. గౌః=గోశబ్దము, ఏకాదశసు - పదునొకండైన, వాచి=వాక్కునందును, వారి= ఉదకమునందును, పశౌ=పశువునందును, భూమౌ=భూమియందును, దిశి=దిక్కునం

దును, లోమ్ని=దేహామండలి వెండ్రుకలయందును, పవౌ=వజ్రాయుధమునందును, దివి=స్వర్గమునందును, విశిఖే=బాణమునందును, దీధితౌ=కాంతియందును, దృష్టౌ=నేత్రమునందును, స్మృతః=(వర్తించునని), తలంపఁబడుచున్నది.

మూ. చంద్రే సూర్యే యమే విష్ణౌ వాసవే దర్దురే హయే,
మృగేంద్రే వానరే వాయౌ దశ స్వపి హరి స్మృతః. ౨౮

టీ. హరిః=హరిశబ్దము, దశస్వపి=పదియైన, చంద్రే=చంద్రునియందును, సూర్యే=సూర్యునియందును, యమే = యమధర్మరాజునందును, విష్ణౌ = నారాయణుని యందును, వాసవే=ఇంద్రునియందును, దర్దురే=కప్పయందును, హయే=గుఱ్ఱము నందును, మృగేంద్రే=సింహమునందును, వానరే=కోఁతియందును, వాయౌ=గాలి యందును, స్మృతః=(వర్తించునని) తలంపఁబడుచున్నది.

మూ. పద్మే కరికరప్రాంతే వ్యోమ్ని ఖడ్గఫలే గదే,
వాద్యభాండముఖే తీర్థే జలే పుష్కర మష్టసు. ౨౯

టీ. పుష్కరం=పుష్కరశబ్దము, అష్టసు=ఎనిమిదైన, పద్మే=తామరయందును, కరికర ప్రాంతే, కరి=ఏనుఁగుయొక్క, కర=తొండముయొక్క, ప్రాంతే=కొనయందును, వ్యోమ్ని=ఆకాశమునందును, ఖడ్గఫలే=కత్తియొక్కకొనయందును, గదే=వ్యాధి యందును, వాద్యభాండముఖే - వాద్య = మద్దెలమొదలగు, భాండ = పాత్రల యొక్క, ముఖే=నోటియందును, తీర్థే=పుణ్యతీర్థమునందును, జలే = ఉదకము నందును, (వర్తించుచున్నది).

మూ. శృంగారాదౌ కషాయాదౌ ఘృతాదౌ చ విషే జలే,
నిర్యాసే పారదే రాగే వీర్యేచ రస ఇష్యతే. ౩౦

టీ. రసః=రసశబ్దము, శృంగారాదౌ=శృంగారాదినవరసములయందును, కషాయాదౌ=కషాయాదిషడ్రసములయందును, ఘృతాదౌ=నేయిమొదలగు ద్రవద్రవ్యములయం దును, విషే=విషమునందును, జలే=నీటియందును, నిర్యాసే=మ్రానిబంకయందును, పారదే=పాదరసమునందును, రాగే= ప్రీతియందును, వీర్యేచ = పరాక్రమము నందును, ఇష్యతే=ఇష్టమగుచున్నది.

మూ. తీర్థం ప్రవచనే పాత్రే లబ్ధామ్నాయే విదాంవరే,
పుణ్యారణ్యే జలోత్తారే మహాసత్యాం మహామునౌ. 3౧

టీ. తీర్థం = తీర్థశబ్దము, ప్రవచనే = శాస్త్రమునందును, పాత్రే = స్థాలి మొదలగుపాత్రలయందును, లబ్ధామ్నాయే = యజ్ఞమునందును, విదాంవరే = పండితునియందును, పుణ్యారణ్యే = పరిశుద్ధమైనఅడవియందును, జలోత్తారే = రేవునందును, మహాసత్యాం = పతివ్రతాస్త్రీయందును, మహామునౌ = మహర్షియందును, (వర్తించుచున్నది).

మూ. ధాతుః పంచసు లోహేషు శరీరస్య రసాదిషు,
పృథివ్యాదిచతుష్కేచ స్వభావే ప్రకృతావపి. 3౨

టీ. ధాతుః = ధాతుశబ్దము, పంచసు = అయిదైన, లోహేషు = ఇనుము, బంగారము, వెండి, తామ్రము, సీసము అను వీనియందును, శరీరస్య= దేహముయొక్క, రసాదిషు=రక్తము, మాంసము, చర్మము, మేదస్సు మొదలగువానియందును, పృథివ్యాదిచతుష్కేచ=పృథివి అప్పు, తేజస్సు, వాయువు అనునాల్గింటియందును, స్వభావే = సహజగుణమునందును, ప్రకృతావపి = ప్రకృతియందును, (వర్తించుచున్నది).

మూ. ఆకృతా వక్షరే రూపే బ్రాహ్మణాదిషు జాతిషు,
మాల్యానులేపయో శ్చైవ వర్ణో షట్సు నిగద్యతే. 33

టీ. వర్ణః=వర్ణశబ్దము,షట్సు=ఆఱయిన,ఆకృతౌ=ఆకారమునందును, అక్షరే=అకారాది వర్ణములయందును, రూపే = తెల్పుమొదలగువర్ణములయందును, బ్రాహ్మణాదిషు బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులనెడు, జాతిషు=జాతులయందును, మాల్యానులేపయోః, మాల్య = పుష్పహారమునందును, అనులేప= చందనాదిలేపనద్రవ్యము నందును, నిగద్యతే=చెప్పఁబడుచున్నది.

మూ. అకారాదా వుదాత్తాదౌ షడ్జాదౌ నిస్వనే స్వరః,
సంకేతాచారసిద్ధాంతకాలేషు సమయస్స్మృతః. 3౪

టీ. స్వరః = స్వరశబ్దము, అకారాదౌ = అకారము మొదలగు పదునాలుగు అచ్చులయందును, ఉదాత్తాదౌ = ఉదాత్త, అనుదాత్త, స్వరిత, ప్రచయములయం

దును, షడ్జాదౌ=షడ్జ, నిషాద, ఋషభ, గాంధార, మధ్యమ, ధైవత, పంచమ స్వరములయందును, నిస్వనే=ధ్వనియందును, (తలంపఁబడుచున్నది).

సమయః=సమయశబ్దము, సంకేతాచారసిద్ధాంతకాలేషు - సంకేత=వ్యవస్థయందును, ఆచార=నడవడికయందును, సిద్ధాంత=నిశ్చయమైనఅర్థమునందును, కాలేషు=ప్రొద్దునందును, స్మృతః=సమ్మతింపఁబడుచున్నది.

మూ. తంత్రం ప్రధానే సిద్ధాంతే సైన్యే తంతౌ పరిచ్ఛదే,
సత్త్వ మోజసి సత్తాయా ముత్సాహే ఽంభసి జంతుషు. 3౫

టీ. తంత్రం=తంత్రశబ్దము, ప్రధానే=ముఖ్యమైనదానియందును, సిద్ధాంతే=స్థిరింపఁబడిన అర్థమునందును, సైన్యే=సేనయందును, తంతౌ=దారమునందును, పరిచ్ఛదే=పరివారమునందును (వర్తించుచున్నది).

సత్త్వం=సత్త్వశబ్దము, ఓజసి=తేజస్సునందును, సత్తాయాం=ఉండుటయందును, ఉత్సాహే=ఉల్లాసమునందును, అంభసి=నీటియందును, జంతుషు=ప్రాణులయందును, (వర్తించుచున్నది).

మూ. రూపాదౌ తంతుషు జ్యాయా మప్రధానేఽనయే గుణః,
జ్ఞానచారిత్రమోక్షాత్మ శ్రుతయో బ్రహ్మశబ్దకాః. 3౬

టీ. గుణః=గుణశబ్దము, రూపాదౌ=రూపాదిచతుర్వింశతిగుణములయందును, తంతుషు=దారమునందును, జ్యాయాం=అల్లెత్రాటియందును, అప్రధానే=ఉదాసీనవస్తువునందును, నయే=నీతియందును (వర్తించుచున్నది).

జ్ఞానచారిత్రమోక్షాత్మశ్రుతయః - జ్ఞాన=తెలివి, చారిత్ర=సద్వ్యాపారము, మోక్ష=కైవల్యము, ఆత్మ=పరమాత్మ, శ్రుతయః=వేదము, ఈయైదును బ్రహ్మశబ్దకాః=బ్రహ్మశబ్దవాచ్యములు.

మూ. అవకాశే క్షణే వస్త్రే బహిర్యోగే వ్యతిక్రమే,
మధ్యేఽంతఃకరణే రంధ్రే విశేషే విరహేఽంతరమ్. 3౭

టీ. అంతరం=అంతరశబ్దము, అవకాశే=రెండువస్తువులమధ్యస్థానమునందును, క్షణే=క్షణకాలమునందును, వస్త్రే=వలువయందును, బహిర్యోగే=బయటిసంబంధమునందును, వ్యతిక్రమే=దాటిపోవుటయందును, మధ్యే=ఒకవస్తువుమధ్యభాగము

నందును, అంతఃకరణే = మనస్సునందును, రంధ్రే=బెజ్జమునందును, విశేషే=భేదమునందును, విరహే=ఎడఁబాటునందును (వర్తించుచున్నది).

మూ. హేతౌ నిదర్శనే ప్రశ్నే స్తుతౌ కంఠసమీకృతౌ,
అనంతరేఽధికారార్థే మాంగల్యే చాథ ఇష్యతే. ౩౮

టీ. అథ=అథశబ్దము, హేతౌ=కారణమునందును, నిదర్శనే=దృష్టాంతమునందును, ప్రశ్నే=పృచ్ఛయందును, స్తుతే=పొగడుటయందును, కంఠసమీకృతౌ=గొంతుసరి చేసికొనుటయందును, అనంతరే=తర్వాత నను నర్థమునందును, అధికారార్థే=అధికార మనుఅర్థమునందును, మాంగల్యే = శుభమునందును, ఇష్యతే = అపేక్షింపఁబడుచున్నది.

మూ. హేతా వేనం ప్రకారాదా వ్యవచ్ఛేదే విపర్యయే,
ప్రాదుర్భావే సమాప్తౌ చ ఇతిశబ్దః ప్రకీర్తితః. ౩౯

టీ. ఇతిశబ్దః = ఇతి యనుశబ్దము, హేతౌ = కారణమునందును, ఏవం ప్రకారాదౌ = ఈవిధ మనునదిమొదలైన అర్థమునందును, వ్యవచ్ఛేదే = భేదపఱుచుటయందును, విపర్యయే = మార్పుచేయుటయందును, ప్రాదుర్భావే=మొదలుపెట్టుటయందును,సమాప్తౌచ = పూర్తియైనదానియందును, ప్రకీర్తితః = చెప్పఁబడుచున్నది.

మూ. ధర్మో ధను ష్యహింసాదా ఉత్పాతాదా వయే నయే,
ద్రవ్యం క్రియాశ్రయే విత్తే జీవాదా ధాతువైకృతౌ. ౪౦

టీ. ధర్మః = ధర్మశబ్దము, ధనుషి = వింటియందును, అహింసాదౌ = అహింసమొదలగుదానియందును, ఉత్పాతాదౌ = అశుభసూచకము మొదలగుదానియందును, అయే = పుణ్యకర్మమునందును, నయే = నీతియందును (వర్తించుచున్నది).

ద్రవ్యం=ద్రవ్యశబ్దము, క్రియాశ్రయే=వ్యాపారాశ్రయమైనవస్తువునందును, విత్తే = ధనమునందును, జీవాదౌ = ప్రాణము మొదలగు పదార్థములయందును, ధాతువైకృతౌ = వెండిబంగారువికారములైన రూకలు వరహాలు మొదలగునాణెములయందును (వర్తించుచున్నది).

మూ. మూర్తిమత్సు పదార్థేషు సంసారి ణ్యపి పుద్గలః,
అకర్కర్కర్నోకర్మ జాతిభేదేషు సర్గణా. ౪౧

టీ. మూర్తిమత్సు = ఆకారముగల, పదార్థేషు = వస్తువులయందును, సంసారిణ్యపి= సంసారముగలవానియందును, పుద్గలః = పుద్గలశబ్దము (వర్తించుచున్నది).

ఆకర్మకర్మనోకర్మజాతిభేదేషు, అకర్మ = అనంతజ్ఞానాద్యకర్మములయందును, కర్మ = జ్ఞానావరణాదికర్మములయందును, నోకర్మ = ఔదారికశరీరాది నోకర్మములయందును, జాతిభేదేషు = ఉత్పత్తిభేదములయందును, వర్గణా = వర్గణాశబ్దము వర్తించుచున్నది.

మూ. ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశస శ్శ్రియః,
వైరాగ్య స్యావబోధస్య షణ్ణా మర్థే భగ స్స్మృతః. ४౨

టీ. సమగ్రస్య = సంపూర్ణమైన, ఐశ్వర్యస్య = సంపత్తుయొక్కయు, వీర్యస్య = పరాక్రమముయొక్కయు, యశసః = కీర్తియొక్కయు, శ్రియః = కాంతియొక్కయు, వైరాగ్యస్య = విరక్తియొక్కయు, అవబోధస్య = జ్ఞానముయొక్కయు, షణ్ణాం = ఈయాఱింటియొక్క, అర్థే = అభిధేయమునందు, భగః = భగశబ్దము, స్మృతః = స్మరింపఁబడుచున్నది.

మూ. ప్రాహుః కైవల్య మార్హంత్యే వైవృతే నిర్వృతా వపి,
లబ్ధిః కేవలబోధాదా వవాప్తౌ నియతౌ శ్రియాం. ४3

టీ. ఆర్హంత్యే = అర్హదాఖ్యానమునందును, వైవృతే = విస్తారమైన పదార్థమునందును, నిర్వృతావపి = మోక్షమునందును, కైవల్యం = కైవల్యశబ్దమును, ప్రాహుః = చెప్పుదురు.

లబ్ధిః = లబ్ధిశబ్దము, కేవలబోధాదౌ= కేవలజ్ఞానము మొదలగుదానియందును, అవాప్తౌ = ప్రాప్తియందును, నియతౌ = విధియందును, శ్రియాం = సంపదయందును (వర్తించుచున్నది.)

మూ. అనేకాంతే చ విద్యాదౌ స్యా న్నిపాత శ్శుభే క్వచిత్,
దర్శనాదౌ మణౌ రత్నం భవ్యం సత్యే ప్రశస్యకే. ४४

టీ. స్యాత్,అను నిపాతావ్యయము, అనేకాంతేచ = అనేకాంతమైనదానియందును, విద్యాదౌ = విద్యమొదలగువానియందును, స్యాత్ = వర్తించుచున్నది.

రత్నం=రత్నశబ్దము, దర్శనాదౌ = సమ్యగ్దర్శనము మొదలగువానియందును, మణౌ=పద్మరాగాదిమణులయందును, క్వచిత్ = కొన్నికాలములయందు, శుభే= మంగళమునందును, (వర్తించుచున్నది).

భవ్యం=భివ్యశబ్దము, సత్యే=యథార్థమునందును, ప్రశస్యకే=యోగ్యమైనదాని యందును, (వర్తించుచున్నది).

మూ. పరమాత్మా జినే సిద్ధే పరమేష్ఠ్యర్హదాదిషు,
సిద్ధి స్సిద్ధనిషద్యాయా మర్హత్సిద్ధశ్రియా మపి. ౭౫

టీ. పరమాత్మా=పరమాత్మశబ్దము, జినే=అర్హత్పరమేశ్వరునియందును, సిద్ధే=ముక్తుఁడైనవానియందును, పరమేష్ఠ్యర్హదాదిషు- పరమేష్ఠి=పంచపరమేష్ఠులయందును, అర్హదాదిషు = అర్హత్పరమేశ్వరుఁడు మొదలగువారియందును, (వర్తించుచున్నది).

సిద్ధిః=సిద్ధిశబ్దము, సిద్ధనిషద్యాయాం-సిద్ధ=సిద్ధులయొక్క, నిషద్యాయాం=స్థలములయందును, అర్హ..శ్రియామపి- అర్హత్సిద్ధ = అర్హత్పరమేశ్వరునియొక్క, శ్రియామపి=సంపదయందును, (వర్తించుచున్నది).

మూ. అర్హత్సిద్ధా వితి ద్వావ ప్యర్హ త్సిద్ధాభిధాయినౌ,
అర్హదాదీ నపి ప్రాహు శ్శరణ్యోత్తమమంగళాన్. ౭౬

టీ. అర్హత్సిద్ధౌ=అర్హత్, సిద్ధః, ఇతి=ఇట్లనెడు, ద్వావపి = ఈరెండుశబ్దములుకూడ, అర్హత్సిద్ధాభిధాయినౌ, అర్హత్=ఘాతుకకర్మలను చెడిపిన జినదేవునిని, సిద్ధ=అష్టకర్మలను జయించినముక్తులును, అభిధాయినౌ=చెప్పునవి, (అగుచున్నవి).

అర్హదాదీన్=అర్హత్పమేశ్వరుఁడు మొదలగువారిని, శరణ్యోత్తమమంగళానపి, శరణ్య = రక్షకులనుగాను, ఉత్తమ = శ్రేష్ఠులనుగాను, మంగళానపి=శుభకారులను గాను, ప్రాహుః=చెప్పెదరు.

మూ. వక్తా వాచస్పతి ర్యత్ర శ్రోతా శక్ర స్తథాపి చ,
శబ్దపారాయణ స్యాంతం న గతౌ తత్ర కే వయం. ౭౭

టీ. యత్ర = ఏశబ్దపారాయణవిషయమునందు, వాచస్పతిః = బృహస్పతియే,వక్తా = చెప్పెడువాఁడు, శక్రః = ఇంద్రుఁడే, శ్రోతా = వినెడువాఁడు, తథాపిచ =

ఆట్లైనను, (వారిద్దఱును) శబ్దపారాయణస్య, శబ్ద=శబ్దములయొక్క, పారాయణస్య=పఠనమునకు, అంతం=తుదిని, నగతౌ=పొందినవారుకారో, తత్ర=ఆశబ్దముల పఠనవిషయమునందు,వయం=మేము, కే=ఎంతమాత్రపువారము? (అనఁగాస్తుతించుటకు మేముచాలనివార మనుట.)

మూ. తథాపి కించిత్కస్మైచి త్ప్రతిబుద్ధాయ సూచితమ్,

టీ. తథాపి=అట్లైనను, ప్రతిబుద్ధాయ=జ్ఞానియైన, కస్మైచిత్=ఒకానొకనికై, కించిత్=స్వల్పము, సూచితం=సూచింపఁబడియున్నది.

మూ. ప్రమాణ మకలంకస్య పూజ్యపాదస్యలక్షణం. ౪౮
ద్విసంధానకవేః కావ్యం రత్నత్రయ మపశ్చిమమ్,

టీ. అకలంకస్య=అకలంకభట్టారకునియొక్క, ప్రమాణం=న్యాయశాస్త్రమును, పూజ్యపాదస్య=పూజ్యపాదుఁడను దేవనందియొక్క, లక్షణం=వ్యాకరణమును, ద్విసంధానకవేః=ద్విసంధాన గ్రంథకర్తయైన ధనంజయునియొక్క, కావ్యం=కావ్యమును, అపశ్చిమం=శ్రేష్ఠమైన, రత్నత్రయం = రత్నత్రయమని, స్మృతమ్=స్మరింపఁబడుచున్నది.

మూ. జాతే జగతి వాల్మీకౌ శబ్దః కవి రితి స్మృతః. ౪౯
కవీ ఇతి తతో వ్యాసే కవయశ్చేతి దండిని,
వయః కవయశ్చేతి బహుత్వం దూర మాగతం,
వినివృత్తం చిరా దేత త్కలౌ జాతే ధనంజయే. ౫౦

టీ. వాల్మీకౌ=వాల్మీకిఋషి, జాతే=పుట్టఁగా, జగతి=లోకమునందు, కవిరితి(ఏకవచనరూపమైన) కవిః అను, శబ్దః=శబ్దము, స్మృతః=తలంపఁబడెను. తతః=తర్వాత, వ్యాసే=వ్యాసమహర్షి, (పుట్టఁగా) కవీఇతి = (ద్వివచనరూపమైన) కవీఅనుశబ్దము స్మరింపఁబడెను. దండిని=దండికవి, (పుట్టఁగా) కవయశ్చేతి = (బహువచనరూపమైన) కవయః అనుశబ్దము చెప్పఁబడెను. కవయఃకవయశ్చేతి=కవులు,కవులు అని, దూరం=బహుదూరముగా, ఆగతం = వచ్చిన, బహుత్వం = బహువచనత్వము,

ఏతత్కాలే = ఈకలియుగమునందు, ధనంజయే=ధనంజయకవి, జాతే=పుట్టఁగా, చిరాత్=బహుకాలమునకు, (అనఁగా క్రమక్రమముగా) వినివృత్తం = నివృత్తమైనది. (అనఁగా ఈధనంజయకవికంటె నధికుఁడైన కవిలేనందువలన కవిశబ్దమునకు ఏకవచనము మాత్రమే ఉపయోగించుచున్నచ్చిరని తాత్పర్యము).

ఇతి ధనంజయనిఘంటౌ నానార్థశబ్దవర్ణనంనామ
ద్వితీయః పరిచ్ఛేదః
సమాప్తః.

ఇది ధనంజయనిఘంటువునందు నానార్థశబ్దవర్ణనం బను రెండవపరిచ్ఛేదము
సంపూర్ణము.

---

శ్రీః.

ధనంజయనిఘంటోః

# అకారాద్యాదిపదసూచికా.


| పదం. | పుటం. | పదం. | పుటం. | పదం. | పుటం. |
|---|---|---|---|---|---|
| అ. | | అంసః | 27 | అధమః | 45 |
| అంగం | 10 | అంహః | 36 | అధరః | 27 |
| అంగనా | 8 | అకస్మాత్ | 51 | అధమం | 41 |
| అంగీకృతం | 51 | అకూపారః | 7 | అధ్వా | 43 |
| అంగరాగః | 33 | అఖిలం | 49 | అధిపః | 3 |
| అంఘ్రిః | 29 | అగః | 3 | అధీః | 45 |
| అంఘ్రిపః | 3 | అగారం | 36 | అధోక్షజః | 20 |
| అంజనః | 55 | అగ్నిః | 17 | అన్వయః | 44 |
| అంజనాసుతః | 17 | అగ్రజః | 11, 33 | అన్వవాయః | 44 |
| అంతః | 60 | అగ్రిమం | 42 | అనభ్రాట్ | 5 |
| అంతకః | 39 | అఘం | ,, | అనవరతం | 49 |
| అంతరం | 44 | అచలః | 21 | అనంతః | 53 |
| అంతరిక్షం | 13 | అచండీ | 9 | అనలః | 17 |
| అంతేవాసీ | 2 | అజః | 19, 60 | అనన్యజః | 21 |
| అంతఃకరణం | 22 | అజర్యం | 51 | అనంతాత్మా | 19 |
| అంత్యః | 35 | అజస్రం | ,, | అనంతరః | 38 |
| అంత్యకాశ్యపః | ,, | అజాతరిపుః | 39 | అనిమిషః | 5 |
| అంధకారం | ,, | అటనీ | 22 | అనిలః | 16 |
| అంబరం | 13, 32, 54 | అటనీ | 4 | అన్వితం | 43 |
| అంబికా | 18 | అత్యంతం | 46 | అనీకం | 24 |
| అంబు | 4 | అత్యర్థం | 46 | అనుక్రోశః | 31 |
| అంబుదః | 4, 5 | అత్యంతాయ | 51 | అనుకంపా | 31 |
| అంబుధిః | 4 | అదభ్రం | 56 | అనుగః | 8 |
| అంభః | 4 | అథ | 65 | అనుజీవీ | 8 |
| అంశుః | 12 | అద్రిః | 3, 56 | అనుచరః | 8 |
| అంశుకం | 32 | అద్భుతం | 47 | అనురహసం | 47 |

| పదం. | పుటం. |
|---|---|
| అనుజః | 11 |
| అనుజా | 11 |
| అనేహః | 34 |
| అనేకపః | 24 |
| అనేడః | 45 |
| అనోకహః | ,, |
| అప్ | 4 |
| అపఘనః | 10 |
| అపత్యం | 10 |
| అపర్ణా | 18 |
| అపదానం | 41 |
| అపదక్షిణః | 5 |
| అప్సరోనాథః | 15 |
| అపారపారః | 7 |
| అప్రాజ్ఞః | 46 |
| అపాంగః | 27 |
| అబలా | 8 |
| అబ్దః | 5 |
| అభ్రం | 5 |
| అభయం | 52 |
| అభ్యర్ణం | 38 |
| అభ్యాసం | 38 |
| అభిరూపః | 32 |
| అభిరామం | 51 |
| అభిలాషుకః | 47 |
| అభిసారికా | 9 |
| అభిలాపః | 43 |
| అభియోగః | 48 |
| అమరః | 15 |
| అమర్షః | 30 |
| అమలం | 46 |
| అమా | 48 |
| అమిత్రం | 11 |
| అమృతోద్భవః | ,, |
| అమృతం | 34 |
| అరం | 46 |
| అరణ్యం | 4 |
| అరణ్యానీచరః | 4 |
| అర్ణః | ,, |
| అర్థః | 60 |
| అర్ఘః | 59 |
| అర్భకః | 10 |
| అర్యమా | 12 |
| అర్కః | 12 |
| అర్వాక్ | 31 |
| అర్వా | 13 |
| అరాతిః | 11 |
| అరిః | 11 |
| అర్చిః | 11 |
| అర్థః | 60 |
| అర్ఘః | 59 |
| అర్జునః | 38 |
| అర్జునం | 40 |
| అర్ణవః | 7 |
| అరవిందం | 6 |
| అరం | 42 |
| అలకానిలయః | 26 |
| అలజ్జికా | 9 |
| అవదాతం | 40 |
| అవలగ్నం | 38 |
| అవనిః | 2 |
| అవధిః | 7 |
| అవశ్యాయః | 47 |
| అవరజః | 11 |
| అవిదూరం | 38 |
| అశనిః | 5 |
| అశ్వః | 13 |
| అశ్లీలం | 41 |
| అశోకః | 56 |
| అసితం | 40 |
| అస్త్రం | 23 |
| అసృక్ | 49 |
| అసిః | 24 |
| అస్తుకారః | 51 |
| అష్టపాత్ | 25 |
| అష్టాపదం | 24 |
| అహంయుః | 45 |
| అహః | 13 |
| అహ్నాయ | 42 |
| అహితః | 11 |
| అహిః | 35 |
| అహో | 47 |
| అళిః | 22 |
| అళికం | 49 |
| అళిప్రభం | 40 |
| అక్షః | 61 |
| అక్షం | 36 |
| అక్షి | 27 |
| అక్షౌహిణీ | 24 |
| **ఆ** | |
| ఆకాలికీ | 5 |
| ఆకాశః | 13 |
| ఆకూతం | 22 |
| ఆఖండలః | 15 |
| ఆగమః | 2 |
| ఆచార్యః | 31 |
| ఆజ్యం | 34 |
| ఆజవంజవః | 56 |
| ఆజిః | 24 |
| ఆతపత్రం | 50 |

| పదం. | పుటం. |
|---|---|
| ఆత్మజః | 10 |
| ఆత్మభూః | 19 |
| ఆత్యంతికం | 43 |
| ఆద్యః | 32 |
| ఆనతం | 42 |
| ఆనందం | 30 |
| ఆననం | 26 |
| ఆదేశః | 41 |
| ఆనంత్యం | 56 |
| ఆపగా | 7 |
| ఆభరణం | 33 |
| ఆభీక్ష్ణ్యం | 48 |
| ఆమ్నాయః | 44 |
| ఆయల్లకం | 43 |
| ఆయుధం | 23 |
| ఆర్యా | 9 |
| ఆలంబ్యం | 37 |
| ఆలంబం | 37 |
| ఆలంభః | 43 |
| ఆలయః | 37 |
| ఆవళిః | 7 |
| ఆవసథం | 37 |
| ఆవాసం | 37 |
| ఆవృతిః | 56 |
| ఆశ్చర్యం | 47 |
| ఆశ్వనితం | 22 |
| ఆశా | 16 |
| ఆశాపాలకః | ,, |
| ఆశాహస్తీ | 16 |
| ఆశు | 46 |
| ఆశుశుక్షణిః | 17 |
| ఆసందీ | 32 |
| ఆసనం | 32, 38 |
| ఆసవః | 34 |

| పదం. | పుటం. |
|---|---|
| ఆస్యం | 26 |
| ఆస్పదం | 37 |
| ఆసురీ | 34 |
| **ఇ.** | |
| ఇతి | 45 |
| ఇంద్రః | 3,14 |
| ఇంద్రజిత్ | 36 |
| ఇందిరా | 20 |
| ఇంద్రియం | 36 |
| ఇందీవరం | 6 |
| ఇనః | 3,12 |
| ఇభః | 24 |
| ఇరా | 34 |
| ఇష్టః | 9 |
| ఇష్టా | 9 |
| ఇషుః | 21 |
| ఇళా | 2 |
| **ఈ.** | |
| ఈరితం | 29 |
| ఈశ్వరః | 8 |
| ఈశానః | 3 |
| ఈశితా | 8 |
| **ఉ.** | |
| ఉగ్రం | 48 |
| ఉగ్రః | 18 |
| ఉచ్చం | 42 |
| ఉచ్చావచం | 42 |

| పదం. | పుటం. |
|---|---|
| ఉచ్ఛ్వాసః | 7 |
| ఉచ్ఛ్రితం | 42 |
| ఉచ్చైః | 42,51 |
| ఉడు | 12 |
| ఉత్పలం | 6 |
| ఉత్కలికా | 7 |
| ఉత్తరాశాపతిః | 25 |
| ఉత్తమాంగం | 29 |
| ఉత్సవః | 30 |
| ఉత్సాహః | 47 |
| ఉత్తానశయః | 10 |
| ఉదజః | 38 |
| ఉదరం | 27 |
| ఉదశ్విత్ | 34 |
| ఉద్వాహః | ,, |
| ఉద్యమః | 47 |
| ఉద్యోగః | 47 |
| ఉన్నతం | 42 |
| ఉపలః | 46 |
| ఉపసర్పః | 48 |
| ఉపత్యకా | 3 |
| ఉపకంఠం | 7 |
| ఉద్దేశః | 45 |
| ఉద్ధతిః | 45 |
| ఉద్దీపః | 45 |
| ఉపాంశు | 47 |
| ఉపాంతః | 3 |
| ఉపేంద్రః | 20 |
| ఉభయం | 1 |
| ఉమాపతిః | 18 |
| ఉరః | 27 |
| ఉరచ్ఛదః | 27 |
| ఉరగః | 35 |
| ఉర్వరా | 2 |

| పదం. | పుటం. |
|---|---|
| ఉరరీకృతం | 50 |
| ఉర్వీ | 2 |
| ఉల్బణం | 48 |
| ఉష్ట్రః | 25 |
| ఉష్ణకం | 48 |
| ఉష్ణవారణం | 56 |
| ఉస్రః | 11 |
| ఉర్జస్వీ | 5J |
| ఉరరీకృతం | 51 |
| ఊ. | |
| ఊర్జః | 11 |
| ఋ. | |
| ఋణం | 46 |
| ఋషిః | 1 |
| ఋత్విః | 12 |
| ఏ. | |
| ఏకపత్నీ | 9 |
| ఏకపింగలః | 26 |
| ఏకాగారికః | 45 |
| ఏనః | 36 |
| ఐ. | |
| ఐరావణాధిపః | 15 |
| ఐక్ష్వాకుః | 32 |
| ఓ. | |
| ఓఘః | 44 |
| ఓజస్వీ | 56 |
| ఓషధీశ్వరః | 12 |
| ఓష్ఠః | 27 |
| క. | |
| కం | 29 |
| కకుప్ | 16 |
| కచః | 50 |
| కంచుకః | 50 |

| పదం. | పుటం. |
|---|---|
| కచ్చిత్ | 42 |
| కటాక్షః | 27 |
| కటిః | 29 |
| కటిసూత్రం | 33 |
| కంఠః | 27 |
| కఠినం | 42 |
| కంఠీరవః | 25 |
| కఠోరం | 42 |
| కణః | 21 |
| కదనం | 24 |
| కదళీ | 56 |
| కద్వదః | ,, |
| కదంబకం | 38 |
| కనకం | 25 |
| కన్యాపతిః | 49 |
| కనీయాన్ | 11 |
| కపర్దీ | 18 |
| కపాలీ | 18 |
| కపిః | 3 |
| కపిశం | 40 |
| కపిధ్వజః | 38 |
| కబరీ | 50 |
| కంబు | 55 |
| కమ్రం | 51 |
| కమలం | 61 |
| కమనం | 51 |
| కమనీయం | 51 |
| కమ్రం | 51 |
| కరవాలకః | 23 |
| కరదండం | 6 |
| కరః | 11, 27 |
| కరభః | 25 |
| కరిణం | 36 |
| కర్దమః | 6 |

| పదం. | పుటం. |
|---|---|
| కర్కశం | 42 |
| కర్ణః | 27 |
| కర్ణకాలః | 39 |
| కరీ | 24 |
| కరుణా | 31 |
| కర్బురః | 40 |
| కరాంగులిః | 27 |
| కర్పూరం | 33 |
| కరేణుః | 24 |
| కలంకం | 41 |
| కలమః | ,, |
| కలహః | 47 |
| కలధౌతం | 25 |
| కలాపీ | 35 |
| కల్హారం | 6 |
| కలాభృత్ | 12 |
| కల్మాషీ | 40 |
| కల్యాణం | 52 |
| కల్యాణమధురం | ,, |
| కల్లోలః | 7 |
| కలిలం | 36 |
| కవచం | ,, |
| కష్టం | 49 |
| కస్వరం | 26, 55 |
| కంసాంతకః | 19 |
| కస్తూరీ | 33 |
| కళత్రం | 8 |
| కళేబరం | 10 |
| కక్షం | ,, |
| కక్షా | 37 |
| కా. | |
| కాంచనం | 25 |
| కాంచీ | 33 |
| కాండం | 21 |

| పదం. | పుటం. |
|---|---|
| కాంతః | 9 |
| కాంతా | 9 |
| కాంతారం | 4 |
| కాంతం | 51 |
| కాంతిమాన్ | 12 |
| కాదంబరీ | 34 |
| కాననం | 4 |
| కానీనజనకః | 13 |
| కామః | 21 |
| కామనీయకం | 52 |
| కామా | 9 |
| కామినీ | 8 |
| కామీ | 9 |
| కాముకః | 9 |
| కాముకీ | 8,9, |
| కాయః | 10 |
| కార్తస్వరం | 25 |
| కార్తికేయః | 17 |
| కార్ముకం | 21 |
| కాలః | 39 |
| కాలగేయం | 31 |
| కాశ్యపః | 32 |
| కాష్ఠా | 6, 57 |
| కాష్ఠాపాలః | 16 |
| కాష్ఠాగజః | 16 |
| కాష్ఠాంబరః | 16 |
| కాహలం | 42 |
| కాళీ | ,, |
| **కి.** | |
| కింకరః | 8 |
| కించన | 42 |
| కితవః | 44 |
| కిరణః | 11 |
| కిరాతః | 4 |

| పదం. | పుటం. |
|---|---|
| కిరీటీ | 39 |
| కిల్బిషం | 36 |
| కింవదంతీ | 41 |
| **కీ.** | |
| కీనాశః | 47, 59 |
| కీర్ణం | 45 |
| కీచకశత్రుః | 39 |
| కీలాలం | 57 |
| కీశః | 3 |
| **కు.** | |
| కుః | 2 |
| కుంకుమం | 33 |
| కుక్కురః | 25 |
| కుచః | 27 |
| కుబ్జః | 42 |
| కుబేరః | 26 |
| కుంభినీ | 2 |
| కుంభీ | 24 |
| కుమారః | 17 |
| కుముదప్రియః | 12 |
| కుముదం | 6 |
| కురుశత్రుః | 39 |
| కులటా | 9 |
| కులం | 44 |
| కుల్యా | 8,54 |
| కువలయం | 6 |
| కుశం | 4 |
| కుశలః | 44 |
| కుసుమం | 22 |
| కుక్షిః | 27 |
| కూపారః | 7 |
| కూర్పాసః | 56 |

| పదం. | పుటం. |
|---|---|
| **కృ.** | |
| కృచ్ఛ్రం | 49 |
| కృతం | 51 |
| కృతాంతః | 39 |
| కృతాభ్యాసః | 47 |
| కృత్స్నం | 49 |
| కృతీ | 44 |
| కృపణః | 47 |
| కృపా | 31 |
| కృపాణః | 24 |
| కృశానుః | 17 |
| కృష్ణః | 19,40 |
| **కే** | |
| కేకరః | 27 |
| క్రేంకృతం | 30 |
| కేకీ | 35 |
| కేతుః | 23 |
| కేతనం | 55 |
| కేవలీ | 32 |
| కేశః | 56 |
| కేశవః | 19, 20 |
| కేశబంధనం | 56 |
| కేశవాగ్రజః | 38 |
| కేశీ | 19 |
| కేసరీ | 25 |
| **కై** | |
| కైటభారిః | 19 |
| కైవల్యం | 66 |
| కైవరం | 6 |
| కైవల్యం | ,, |
| **కో** | |
| కోకనదం | 6 |
| కోటిః | 57 |

| పదం. | పుట. |
|---|---|
| క్రోడః | 25 |
| కోదండకః | 21 |
| క్రోధః | 30 |
| కోమలం | 42 |
| కోవిదః | 44 |
| కోశః | 49 |
| **కౌ** | |
| క్రౌంచభేదీ | 17 |
| కౌతుకః | 47 |
| కౌంతేయః | 39 |
| కౌలేయకః | 25 |
| కౌక్షేయకః | 24 |
| కౌరవ్యః | 39 |
| కౌశికః | 15 |
| కౌసుమం | 41 |
| **ఖ** | |
| ఖం | 13 |
| ఖండం | 49 |
| ఖణ్ఖృతం | 30 |
| ఖలః | 11 |
| ఖలా | 9 |
| ఖలు | 42, 46 |
| **ఖా** | |
| ఖాతం | 37 |
| ఖేయం | 37 |
| **గ** | |
| గగనం | 13 |
| గంగా | 43 |
| గజః | 24 |
| గణః | 38 |
| గణికా | 9 |
| గ్రంథః | 2 |
| గంధవాహః | 16 |

| పదం. | పుట. |
|---|---|
| గభస్తిః | 11 |
| గర్తః | 49 |
| గర్వితః | 45 |
| గరుత్మాన్ | 36 |
| గరుడః | 36 |
| గహనం | 4, 48 |
| గహ్వరం | 49 |
| గహ్వరీ | 2 |
| గళః | 27 |
| గాండీవకార్ముకః | 38 |
| గ్రామసింహః | 25 |
| గ్రామశార్దూలః | 25 |
| గిరిః | 3 |
| గిరిజా | 18 |
| గీః | 29 |
| గ్రీవా | 27 |
| గుణః | 22, 64 |
| గుణావళిః | 41 |
| గుణీ | 48, 33 |
| గులికం | 25 |
| గుహః | 35, 17 |
| గుహ్యం | 57 |
| గూఢచరః | 45 |
| గృధ్నుః | 47 |
| గృహం | 8 |
| గృహః | 36 |
| గేహం | 36 |
| గేహినీ | 8 |
| గోపురాకృతిః | 36 |
| గోత్రం | 44 |
| గోధః | 8 |
| గోమండలం | 43 |

| పదం. | పుట. |
|---|---|
| గోమినీ | 20 |
| గోలాంగూలః | 3 |
| గోవిందః | 20 |
| గౌః | 11, 61, 44 |
| గౌతమః | 32 |
| గౌరం | 40 |
| గౌరీ | 18, 40 |
| **ఘ** | |
| ఘనః | 5 |
| ఘనాఘనః | 5 |
| ఘర్జః | 29 |
| ఘ్రాణం | 27 |
| ఘృతం | 54 |
| ఘృష్టిః | 25 |
| ఘోషః | 43 |
| **చ** | |
| చక్రపర్యాయః | 12 |
| చండీ | 18 |
| చతురః | 44, 50 |
| చతుర్ముఖః | 19 |
| చతుష్పాత్ | 44 |
| చంద్రః | 12 |
| చంద్రమాః | 12 |
| చమూః | 24 |
| చమూరుః | 25 |
| చరః | 48 |
| చరణం | 29 |
| చర్చా | 58 |
| చలః | 17 |
| చలా | 8 |
| చలనం | 29 |
| చక్షుః | 27 |

నిష్ఠాచేత్కర్తృకర్మణోః। భా
వేచేత్క్లీబమవాత్ర సర్వతం
త్రేష్వయంవిధిః॥౧౫౬॥

ఇతి తాంతాః.

అర్థః ప్రకారే విషయే స్వాన
హేతుప్రయోజనే। అభిధేయే
ధనే శాస్త్రే వస్తుహేతు నివృ
త్తిషు॥౧౫౭॥
గజపృష్ఠాస్తీర్ణ చిత్రద్రవ్యే
వేణ్వాంకుశే కుథః।
రథో దేహేఽపి

సార్థ స్తు వణిక్సంఘేచ
సంహతౌ॥౧౫౮॥
మంథౌ సక్తు వస్థానా
గ్రంథిః పర్వగదాంతరే।
గ్రంథో ధనే వాక్సందర్భే
ద్వాత్రింశద్వర్ణసంహతౌ॥
ఆస్థా ప్రతిజ్ఞా తాత్పర్య గో
ష్ఠీషు తత్నే ఽవలంబనే।
సంస్థా స్థితౌ వ్యవస్థాయాం
సమాప్త్యాకార మృత్యుషు॥
వీథీ వర్త్మని పంక్తౌ చ గృ
హాంగే రూపకాంతరే।
నవనీతే జలే మాథ
ఓన్నంతో ఽమ్బుని పాథసీ॥
జల జీరాణో గురుమో
న్యుపాయశాస్త్రాదిదీ
మునిజుష్టతో ఽయమ్। మంత్రా
ధ్యో ష్టావశ పుణ్యభూమిః
క్షేత్రంజలంస్త్రీ కుసుమంచతీర
థః॥౧౬౦॥

మొదలయినవానికిని-కర్తృకర్మణోః- కర్తృకర్మార్థ
కములయందు-నిష్ఠా చేత్ - క్త ప్రత్యయమువచ్చెనేని-త్రిలింగ
త్వం- మూడులింగములుగలుగుట-భవేత్- అగును- భావే
చేత్-భావార్థమున క్త ప్రత్యయము వచ్చెనేని- క్లీబమేవ.
నపుంసకమే. సర్వతంత్రేషు - సకలసిద్ధాంతములయందు
ను-అయమ్-యితి-విధిః విధానము- ఇది-అని- జ్ఞేయమ్-ఎ
రుంగదగినది॥

—※ తాంతపదవర్గము ముగిసెను. ※—

అర్థ-పు॥ఇది-భేదమునకును-వృత్తాంతాదులకు
ను-ధనమునకును-ప్రయోజనమునకును- వాచ్యార్థమ
మునకును-ధనమునకును-శాస్త్రమునకును- వస్తువునకును-
హేతువునకును నివర్తించుటకును పేరు.

కుథ-పు॥ఇది-ఏనుగువీపునబరచురత్నకంబళికిని-వె
దురునకును-దర్భకును పేరు.

రథ-పు॥ఇది- దేహమునకును- అపిశబ్దమువలనమనో
రథమునకును-రథమునకును-వాహనమునకును పేరు.

సార్థ- పు॥ఇది- వర్తకులసమూహమునకును.
గుంపునకును పేరు.

మంథ-పు॥ఇది-పిండికిని-పక్వమునకును పేరు.

గ్రంథి-పు॥ఇది-గణుపునకును-రోగభేదమునకును పేరు.

గ్రంథ పు॥ఇది-ధనమునకును- శబ్దములగూర్చినప్ర
బంధమునకును ౩౨- అక్షరములసముదాయమునకును పేరు.

ఆస్థా-స్త్రీ॥ఇది-ప్రతిజ్ఞకును-తాత్పర్యమునకును-కొలువు
కూటమునకును-యత్నమునకును-అనుభవించుటకును పేరు.

సంస్థా-స్త్రీ॥ఇది-స్థితికిని- మర్యాదకును-సమాప్తికిని-
స్వరూపమునకును మృతికిని పేరు.

వీథీ-స్త్రీ॥ఇది మార్గమునకును- పఙ్క్తికిని- గృహా
వయవమునకును-నాటకభేదమునకును పేరు.

మాథ-న॥ఇది-వెన్నకును- ఉదకమునకును పేరు.

పాథస్ న॥ఇది-అన్నమునకును- ఉదకమునకును పే.

తీర్థ-న॥ఇది-రేవునకును. గురువునకును-యోనికిని-
ఉపాయమునకును శాస్త్రమునకును- యజ్ఞమునకును-మ
హర్షులుస్నానము చేయుజలాశయమునకును-రాజుయొక్క
యూలోచనస్థానము మొదలగుస్థానములకును- పుణ్యస్థల
మునకును పాత్రమునకును ఉదకమునకును స్త్రీరజస్సు- కు
సుమము.

స్కందో గుహే నదీకూలే

స్కంద-పు। ఇది-కుమారస్వామికిని- నదియొక్కగట్టునకును పేరు.

సాద్యశ్వా రోహసూతయోః।

సాదిన్-పు॥ ఇది- గుఱ్ఱపురౌతునకును- సారథికిని పేరు.

పాదుకో పానహోః పాదూ

పాదూ-స్త్రీ॥ ఇది- చెప్పునకును- పావుకోళ్ళకును పేరు.

ఛర్ద్దిర్వమన రేతసోః॥

ఛర్ద్ది-స్త్రీ॥ ఇది- కక్కుటకును- రేతస్సునకును పేరు.

పాదభూషా శృంఖలయో రదు స్త్రియ

అందు-స్త్రీ॥ ఇది-అందెమొదలయిన పాదాభరణములకును- ఏనుగులగట్టుగొలుసునకును పేరు.

అమీస్త్రియః।

అమీ- ఈ పాదూ- ఛర్ది- అందుశబ్దములు ౩ను స్త్రియః- స్త్రీలింగములుగలవి.

పదవ్యాజాంఘ్రి తచ్చిహ్నస్థానత్రాణాంక లక్ష్మసు। ౨౧౨। వ్యవసాయేపు ప్రిభోఘే సాయకే వస్తువాక్యయోః।

పద-న। ఇది- స్వార్థమయియొకదానినుద్దేశించియు తియొకదానిజేయుటకును- పాదమునకును- అడుగుజాడకును- స్థానమునకును-రక్షించుటకును-కరణమునకును-ఆడియాళమునకును- ఉద్యోగమునకును సుబంతతిఙంతసమూహమునకును-బాణమునకును- వస్తువునకును-వాక్యమునకును పేరు.

ఛందాంసి త్రిష్టుబాదీని శ్రుతీచ్ఛానునయా అపి॥ ౨౧౩॥

ఛందస్-న। ఇది- త్రిష్టుప్పు మొదలగు ఛందస్సులకును- వేదమునకును- యిచ్ఛకును- ఊరడించుటకును పేరు.

నదస్సముద్రే నినదే సరిజ్జ్యే చ

నదీ సరిత్।

నద-పు॥ ఇది- సముద్రమునకును- ధ్వనికిని- పడమరగాబారునదికిని పేరు.

నదీ-స్త్రీ॥ ఇది నదికిపేరు.

గదో రోగహరిభ్రాత్రో ర్గదాప్యాయుధాంతరే॥

గద- ఇది- రోగమునకును- శ్రీకృష్ణునితమ్మునికిని పేరైనపుడు॥పు। ఆయుధవిశేషమునకుపేరగునపుడు॥స్త్రీ॥

కుందం మాఘ్యే చ కుందో నానిధి భేదమురద్విషోః।

కుంద- ఇది- మొల్లపూవునకు పేరగునపుడు॥న। నిధికిని- విష్ణువునకును పేరగునపుడు పు।

మందః పుంసి రవేస్సూనౌ గజభేదేత్వయం త్రిషు॥ ఖల మూర్ఖ జడస్వైర స్వల్పనిర్భాగ్యరోగిషు।

మృదుస్సుష్ణేపి

మంద- ఇది- శనైశ్చరునకు పేరైనపుడు। పు। మందజాతియేనుగునకును- కొండెగానికిని- మూర్ఖునకును- వివేకహీనునకును- స్వేచ్ఛకును- కొంచెమునకును- నిర్భాగ్యునకును- రోగికిని పేరయినపుడు॥ త్రి।

మధురం మృష్ట సాన్యశ్వాన్యద్వ స్వాదు త్రిషు। ౨౧౪।

మృదు। త్రి। ఇది- వేడిలేనిదానికిని- అపిశబ్దమువలన మెత్తనిదానికిని పేరు.

స్వాదు- త్రి। ఇది- మధురమయినదానికిని-రుచిగలదానికిని పేరు.

ఈమృదుస్వాదుశబ్దములు రెండును త్రిలింగములుగలవి.

ఇతి ధాంతాః.

—※ ఇతి ధాంతపదవర్గము ముగిసెను. ※—

బుధస్సూరౌ సురే సౌమ్యే వేధాపిష్ణావిధాతరి।

బుధ-పు-ఇది- పండితునకును- దేవతకును-బుధునకును పేరు.

వేధస్- పు॥ ఇది- విష్ణువునకును బ్రహ్మకును పేరు.

జినా సర్వజ్ఞతథాగతౌ।
ఘనౌ భానుశశాంకౌ
ఘృణీ కిరణభాస్కరౌ
వహ్నిః రక్షణ హామే
మునిస్స్యాద్బుద్ధ మునిభేదయోః

జిన-పు॥ ఇది- పూజ్యునకును- బుద్ధదేవునకును పేరు.
ఘన-పు॥ ఇది- సూర్యునకును-చంద్రునకును పేరు.
ఘృణి-పు॥ ఇది- కిరణమునకును-సూర్యునకును పేరు.
వహ్ని-పు॥ ఇది కంటికిని-గుగ్గిలమునకును అగ్నికిని పేరు.
ముని- పు॥ ఇది-బుద్ధదేవునకును- వృక్షవిశేషమునకును మునికిని పేరు.

బుధ్నశ్శిఫాయాం మూలేచ

బుధ్న-పు. ఇది- చెట్టు మొదలుకొని తుదవరకుబోయిన తీగెకును (అనగా నూడ) చెట్టు మొదటికిని పేరు.

సూనుః పుత్రేనుజేరవౌ

సూను-పు॥ ఇది-కుమారునకును- తమ్మునకును- సూర్యునకును పేరు.

మీనో మృగాంతరే తంత్రా
స్త్రీహిభేదేశుకాంతరే।
స్వప్నస్సుప్తస్య ధీర్నిద్రా
మీనో రాశ్యంతరేపిచ।

మీన పు ఇది-మృగవిశేషమునకును- దారమునకును- ధాన్యభేదమునకును- చిలుకలలో నొకభేదమునకును పేరు.
స్వప్న-పు॥ ఇది నిద్రపోవునవాని బుద్ధికిని-నిద్రకును పేరు.
మీన-పు॥ ఇది-మీనరాశికిని- అపిశబ్దమువలన మత్స్యమునకును పేరు.

ధానాభృష్టయవే వృక్షబీ
జేస్యాద్ధాన్యకేపిచ। ౨౩౪॥
పరస్త్రీ భార్యయోర్జాని
ర్జనిర్జన్మజనిస్స్నుషాః।

ధానా స్త్రీ॥ ఇది-బారుగులకును- వృక్షబీజమునకును- ధాన్యమునకును పేరు.
జాని స్త్రీ॥ ఇది- పరస్త్రీకిని- భార్యకును పేరు.
జని-ఇది- పుట్టుకకు పేరయినపుడు॥ప్న॥ కోడలికి పేరయినపుడు॥ స్త్రీ॥

జ్యోత్స్నపటోలికా సాచ
రాత్రిశ్చంద్రికయాన్వితా॥
జ్యోత్స్నస చంద్రనక్షత్ర
రాత్రౌ చంద్రాతపేపిచ।

జ్యోత్స్న స్త్రీ॥ ఇది-పొట్లతీగెకును-వెన్నలతో గూడిన రాత్రికిని పేరు.
జ్యోత్స్న-స్త్రీ॥ ఇది-చంద్రనక్షత్రములతో గూడిన రాత్రికిని- వెన్నెలకును పేరు.

రత్నంమణౌచ శ్రేష్ఠేచ
వనంకాననసీరయోః।
గతివాహనయోర్యానం
పానం పీతౌచ రక్షణే।
దానంగజమదేత్యాగే శు
ద్ధిఖండనయోరపి। ౨౩౫।
అవకాశేస్థితౌ స్థానం
స్థానేస్యాద్యుక్తమవ్యయం
చిహ్నం పంకే ఏతాకాయు ...

రత్న-న॥ ఇది-మణికిని-శ్రేష్ఠునకును పేరు.
వన-న॥ ఇది-అడవికిని- ఉదకమునకును పేరు.
యాన-న. ఇది- పోవుటకును-వాహనమునకును పేరు
పాన-న। ఇది-త్రాగుటకును. రక్షించుటకును పేరు-
దాన న॥ ఇది- ఏనుగు మదమునకును- త్యాగమునకును- పరిశుద్ధికిని-ఖండించుటకును పేరు.
స్థాన న॥ ఇది- తావునకును-ఉనికికిని పేరు.
స్థానే-అ॥ ఇది-యుక్తమనుటకు పేరు.
చిహ్న- న॥ ఇది- గురుతునకును- ... మునకును పేరు.

ద్యుమ్నం విత్తే పరాక్రమే ॥

ద్యుమ్న-న॥ ఇది- ధనమునకును- పరాక్రమమునకును పేరు.

స్నానీయనేకయోస్స్నానం



స్నాన-న॥ ఇది- స్నానయోగ్యవస్తువునకును. స్నానమునకును పేరు.

మేనస్సాన్యస్సంతుకిల్బిషే।
ఇనోధూపేరవాపుంసి ధనిక
స్వామినో స్త్రీషు॥
యోనిర్ద్వయో ర్భగేస్థా
నేకారణా కారయోరపి।
తను స్త్వక్కాయయోః
స్త్రీస్యా ద్విరళస్వల్పయో
స్త్రీషు। ౨౪౦॥
కఠినాధికసాంద్రేషు వా
ద్యమధ్యసునృత్తయోః। ము
స్తాముద్గరమూర్తేషు త్రిషు
మేఘే ప్రమాణ ఘనః।

వానంశుష్కే శుష్కఫలే
వనసంబంధిని త్రిషు। క్లీ బేత్వ
య్యసురంగాయాం సౌరభే
సేవనేగతౌ। ౨౪౧॥
మానస్త్రీ ణాం కోపభే
దేగర్వేచిత్తోన్నతావపి। మా
నం ప్రమాణే ప్రస్థాదౌ

భక్తేన్నంభక్షితే త్రిషు॥

నగ్నోవం దిక్షపణయోర
యంవివసనే త్రిషు।

సూనంశూన్యే త్రిషుక్లీబేపు
ష్పే సూనాతు మేఖలా॥ ర
శ్మౌ నద్యాం వధస్థానేరస
నాధస్థ స్యలేపిసా।
స్యాచ్ఛన్నం రహసిక్లీబే
ఛాదితే తు త్రిలింగకం। ౨౪౨
సన్నమల్పే విశీర్ణారా

విన్నంలబ్ధేవిచారితే।

అన్యద్ధారితమిశ్రేషుభిన్న

ఏనస్-న॥ ఇది ఆపరాధమునకును-పాపమునకును పేరు॥

ఇన-ఇది- రాజునకును- సూర్యునకును పేరయినపు
డు పు। ధనికునకును-ప్రోపు(?)నకు పేరయినపుడు॥ త్రి॥

యోని-స్త్రీ। ఇది- భగమునకును- స్థానమునకును-
కారణమునకును-ఆకారమునకును పేరు॥

తను-ఇది-చర్మమునకును- శరీరమునకును పేరగున
పుడు॥ స్త్రీ। విరళమగుటకును- స్వల్పమునకును పేరగునపు
డు। త్రి।

ఘన ఇది- కఠినమయినదానికిని- అధికమయినదా
నికిని-దట్టమయినదానికిని- కాంస్య తాళమధ్యభాగమునకు
ను- నృత్తమునకును-తుంగముస్తెకును-లోహపుగుదియకును
కాఠిన్యమునకును పేరైనపుడు॥ త్రి॥ మేఘమునకును పేరగు
నపుడు॥ పు।

వాన- ఇది- ఎండినదానికిని- ఎండిన ఫలమునకును
పేరగునపుడు॥ న॥ వనసంబంధియైనదానికి పేరగునపుడు॥
త్రి। సురంగమునకును- పరిమళమునకును- కుట్టుటకును-
పోవుటకును పేరగునపుడు॥ న॥

మాన. ఇది- స్త్రీలయొక్క కోపవిశేషమునకును-గ
ర్వమునకును- మనోతిశయుండును(?) చిత్తోన్నత్యమునకును పే
రగునపుడు॥ పు॥ ప్రమాణమునకును- మంతమొదలగుకొలు
చుసాధనములకును పేరగునపుడు॥ న॥

అన్న- ఇది- అన్నమునకు పేరగునపుడు॥ న॥ భక్షింప
బడినదానికి పేరైనపుడు॥ త్రి॥

నగ్న-ఇది-కనివానికిని- క్షపణకుండను జైనమతోద్ధా
రకునకును పేరగునపుడు॥ పు॥ వస్త్రహీనునకు పేరగునపు
డు॥ త్రి॥

సూన- ఇది- శూన్యమయినదానికి పేరగు నపుడు॥
త్రి॥ పుష్పమునకు పేరగునపుడు॥ న॥ మొలనూలునకును- కిరణ
మునకును- నదికిని-చంపునట్టిస్థలమునకును-నాలుకయడుగు
ననున్న కొండనాలుకకును పేరయినపుడు॥ స్త్రీ॥

ఛన్న- ఇది- రహస్యమునకు పేరగునపుడు॥ న॥ కప్ప
బడినదానికి పేరగునపుడు॥ త్రి॥

సన్న-న- ఇది- అల్పమునకును- జీర్ణమగుటకును
పేరు॥

విన్న-న॥ ఇది- పొందబడినదానికిని- విచారింపబడిన
దానికిని పేరు॥

భిన్న-న-ఇది- వేరైనదానికిని-ధరింపబడినదానికిని-
కూడినదానికిని పేరు॥

మేఽతేత్రయస్త్రిషు ౹౨౬౬॥

ఏతే- ఈ-నన్న-నిన్న-భిన్న-శబ్దములు-త్రయః- మూడును త్రిషు- త్రిలింగములయందును వర్తించును.

ఇతినాంతాః.

——※ నాంతపదవర్గము ముగిసెను. ※——

రోపోబాణేరోపణేచ

రోప- పు। ఇది-బాణమునకును- ఎక్కు-పెట్టుటకును పేరు.

లేపోభోజనగర్వయోః।

లేప పు॥ ఇది- భోజనమునకును- గర్వమునకును పేరు.

దర్పోఽహంకారకస్తూర్యో

దర్ప-పు॥ఇది- అహంకారమునకును- కస్తూరికిని పేరు.

బాష్పోనేత్రజలోష్మణోః॥

బాష్ప-పు॥ ఇది-కన్నీటికిని-వేడిమికిని పేరు.

సూపోవ్యంజనభేదేపసూపకారేపసూదవత్।

సూప-పు। ఈశబ్దము- సూదశబ్దమువలె- పప్పునకును- వంటవానికిని పేరు.

శపథాక్రోశయోశ్శాపః

శాప-పు। ఇది- శపథమునకును- కోపముపలననిట్టినట్టి తిట్టునకును పేరు.

కపయోఽర్క-భవానరాః।

కపి-పు। ఇది- సూర్యునకును-ఏనుగునకును-కోతికిని పేరు.

కూపః కుకుందరేగర్తే-గుణవృక్షే ప్రహేఽపి।

కూప-పు। ఇది- ఆడుదానిపిరుదులమీదనుండుగుంతలకును- గుంటకును- ఓడమీద పెక్కెముగట్టు స్తంభమునకును-బావికిని పేరు.

కల్పస్తు ప్రళయే న్యాయే శాస్త్రేబ్రహ్మదినేవిధౌ॥ ౨౬౯॥ సురద్రుమేవికల్పేచ ప్రత్యయశ్చేత్సమార్థకః।

కల్ప-పు॥ఇది- ప్రళయమునకును- న్యాయమునకును శాస్త్రమునకును- బ్రహ్మయొక్క దినమునకును- విధికిని-కల్పవృక్షమునకును-వికల్పమునకును పేరు-ఈకల్పశబ్దము వ్యాకరణశాస్త్రమున విధింపబడిన కల్పప్రత్యయమాయెనేని సమానార్థకము అనగా- ప్రభాతకల్పారాత్రిః- అగ్నికల్పశ్శత్రుః- ఇత్యాదిస్థలములయందు- ప్రాతఃకాలసమానమురాత్రియనియు-అగ్నితుల్యుడుశత్రువనియు తెలిసికొనునది.

నిందావిలంబయోః క్షేపో

క్షేప- పు॥ ఇది-నిందకును- కాలవిలంబమునకును పేరు.

వపావివరమేధసోః।

వపా-స్త్రీ॥ఇది-బిలమునకును-మెదడునకును పేరు.

రూపంస్వభావే శబ్దాదౌ సౌందర్యే నాటకేఽపిచ।

రూప-న॥ఇది-స్వభావమునకును-శబ్దాదులకును- సౌందర్యమునకును-నాటకమునకును-అపిశబ్దమువలన- ఆకారమునకును పేరు.

వపుఃకాయేశుభాకారే

వపుస్-న॥ఇది-శరీరమునకును- శుభమయిన యాకారమునకును పేరు.

త్రపుసీసకరంగయోః॥

త్రపు-న॥ఇది- సీసమునకును తగరమునకును పేరు.

స్త్రీణామృతౌ వికాసేచ పుష్పం

పుష్ప న॥ఇది స్త్రీలబుుతువునకును-వికసించుటకును పేరు.

సర్పిఘృతాంబునోః।

సర్పిస్-న॥ఇది- నేతికిని-ఉదకమునకును పేరు.

తల్పం శయ్యాట్టదారేషు

తల్ప-న॥ఇది-పాన్పునకును- నీళ్లకుగట్టునట్లళ్ళకును- ఆవలికిని పేరు.

కృపఃకశ్చిత్కృపాదయోః॥

కృప-ఇది-కృపాచార్యునకు పేరగునపుడు॥ పు॥ దయను పేరగునపుడు॥ స్త్రీ॥

మాఘేపుమాన్ వ్రతేక్లీబే
తపో
గోపస్తుపల్లవే। గోష్ఠాధ్యక్షేమహీశేచ
స్యాద్గోపీశారివాపిచ॥

ఇతిపాంతాః
శిఫాతరుజటాయాంచశాఖామాంసనదీషుచ।
శఫంతరూణాం మూలేపి గవాదీనాంఖురేషుచ॥
రేఫస్స్యాద్ వర్ణే స్యాదధమేతుత్రిలింగకః।

ఇతిఫాంతాః.
స్తంబోగుల్మే వృశాఖై
స్త్రౌ
డింబః ప్లీహ ఖగాండయోః॥

శంబస్తుముసలాగ్రస్థలోహమండలకేపవౌ।
కంబిరంశేచదంశస్య ఖజాకాయామపిస్త్రియామ్।
ప్రతిబింబె తత్ప్రకృతౌ ప్రతి కృత్యాంచ మండలే।
లాంఛనే పిసబింబో స్త్రీ న ద్వయోర్బింబికాఫలే।
కంబుర్నా వలయేశంఖే సంఖ్యాయాం జలశుక్తిషు
నంబ్వ్యంత్రిషు మేచజంబూ స్త్రీ బాక్లి బెజాం బశే ఫలే।
త్రిషుల్వై ... శే క్లీబష్షండే త్వేవనపుంసకమ్।

ఇతిబాంతాః
కుంభః కుంజరమూర్ధాగ్రే కుంభకర్ణేఘటేపిచ॥
భూపాద్రీభూభృతౌ

తపసి-ఇది- మాఘమాసమునకుపేరయినపుడు॥పు॥ వ్రతమునకుపేరయినపుడు॥న॥

గోప-పు॥ఇది-గొల్లవానికిని-పశువులదొడ్డికావలివానికిని- భూమిపతికిని పేరు.

గోపి-స్త్రీ-ఇది- సుగంధపాలతీగకును- చల్లారమువలనగొల్లదానికిని పేరు.

పాంతపదవర్గము ముగిసెను.

శిఫా-స్త్రీ॥ఇది-ఊడకును-కొమ్మకును- మాంసమునకును-నదికిని పేరు.

శఫ- న॥ ఇది-వృక్షములమొదటికిని గోవులుమొదలయినవానిగొరిసెలకును పేరు.

రేఫ-ఇది-ధ్వనికిని- రకారమునకును పేరైనపుడు॥పు॥అధమునకును పేరయినపుడు॥త్రి॥

ఫాంతపదవర్గముముగిసెను.

స్తంబ-పు।ఇది-పొదకును-కొమ్మలేని- ప్రాణికిని అ. తిశబ్దమువలనతృణాదులకును పేరు.

డింబ-పు।ఇది- రొమ్ములో నెడమప్రక్కనుండుపచ్చనిమాంసమునకును-పక్షిగ్రుడ్డునకును పేరు.

శంబ-పు॥ఇది-రోకటిపొన్నునకును- వజ్రాయుధమునకును పేరు.

కంబి- స్త్రీ॥ ఇది - వెదురుయొక్క భాగమునకును- తెడ్డునకును పేరు.

బింబ- ఇది-నీడకును- ఆనీడకు కారణమైనప్రకృతికిని- సమానరూపముగాచేయబడిన ప్రతిమకును- మండలమునకును-గురుతునకును పేరైనపుడు॥పు॥ దొండపండునకు పేరైనపుడు॥న॥

కంబు-పు।ఇది- కడియమునకును- శంఖమునకును-సంఖ్యకును-కప్పచిప్పలకును పేరు.

జంబూ-స్త్రీ। ఇది- నదికిని- నేరేడుచెట్టునకును పేరు- నేరేడుపండునకు పేరగునపుడు॥న॥

క్లీబ-ఇది- పౌరుషములేనివానికిని పేరైనపుడు। త్రి॥ నపుంసకునకు పేరయినపుడు॥న॥

బాంతపదవర్గముముగిసెను.

కుంభ-పు। ఇది- ఏనుగుశిరస్సునకును-కుంభకర్ణునికిని-కడవకును-విటునికిని పేరు.

భూభృత్-పు। ఇది- భూమిని పాలించురాజునకును- పర్వతమునకును పేరు.

జంభాడంభజంబీరదానవాః। దంతేపి చవుమానేవభ త్యవాచిషుసత్రిషు. ౬౬౦।
గర్భోర్భకే నాట్యసంధౌ కుక్షౌ పనసకంటకే। భ్రూణే ప్రవరకే
చాథ స్వభూర్వేధాస్స్మరో హరిః। ౬౬౧।
శంభుర్ధాతృ హరీశేషు
డింభో బాలకమూర్ఖయోః।
నాభిర్మధ్యే ప్రధానేంగే కస్తూర్యాంతు క్షత్రియేన్నృపే॥
స్తంభో జాడ్యేప్య
థసభాసమాజేద్యూతస ద్మ సు।
కదళ్యామప్సరోభేదే రంభా
భాజ్వాలయోః ప్రభా॥
వారిపర్ణ్యాం కట్ఫలే చ కుంభీ స్త్రీ కుంభినోగజాః।
భవ్యేక్లిబే శుభం ద్రవ్యే త్రిషు.
జృంభస్తుజృంభణే॥ ౬౬౪॥
త్రిషునాతువికాసే స్యాన్నభః ఖం శ్రావణో నభాః।
వ్యాజేనిభో నా సదృశే త్రిష్వ
థో వాచ్యలింగకా॥ ౬౬౫॥
ప్రభూః శక్తాధిపౌ
నిత్యే పత్యౌ సర్వగతే విభుః

ఇతి భాంతాః

జంభ - పు॥ ఇది - డంభమునకును నిమ్మపంటికిని - జంభాసురునకును - దంతమునకును పేరు - ఇది భక్ష్యవాచకమైనపుడు" త్రి॥

గర్భ - పు - ఇది - బాలునికిని - నాట్యసంధికిని - కుక్షికిని - పనసకాయముంటికిని - స్త్రీలగర్భమునకును - శ్రేష్ఠునకును పేరు.

స్వభూ - పు। ఇది - బ్రహ్మకును - మన్మథునకిని - విష్ణువునకును పేరు.

శంభు - పు॥ ఇది - బ్రహ్మకును - విష్ణువునకును - శివునికిని పేరు.

డింభ - పు। ఇది - చన్నుగుడుచు బాలునకును - మూర్ఖునికిని పేరు.

నాభి - ఇది మధ్యభాగమునకును - ప్రధానమునకును పేరైనపుడు॥ సీ॥ బొడ్డునకు పేరైనపుడు॥ ప్న॥ కస్తూరికి పేరైనపుడు॥ సీ॥ తు క్షత్రియునికిని - జనపాలునకును పేరైనపుడు॥ పు। నాభిః ప్రధానే ప్రాణ్యాంగే - అనియొకపాఠాంతరము గలదు.

స్తంభ - పు। ఇది - జడభావమునకును - అపిశబ్దమువలన స్తంభమునకును పేరు.

సభా - సీ॥ ఇది - సమూహమునకును - ద్యూతమునకును - శాలకును పేరు.

రంభా - సీ॥ ఇది - అరటిచెట్టునకును - రంభయనునప్సరసకును పేరు.

ప్రభా - సీ॥ ఇది - కాంతికిని - జ్వాలకును పేరు.

కుంభీ - ఇది - నాచునకును - చేకుమానికిని పేరగునపుడు॥ సీ॥ ఏనుగునకు పేరగునపుడు కుంభినః॥ పు॥

శుభ - ఇది - కలుగబోమేడు శుభమునకు పేరగునపుడు॥ న॥ ద్రవ్యమునకు పేరగునపుడు॥ త్రి॥

జృంభ - ఇది - ఆవలింతకు పేరగునపుడు॥ త్రి॥ వికాసమునకు పేరగునపుడు॥ పు।

నభస్ - ఇది - ఆకాశమునకు పేరగునపుడు॥ న॥ శ్రావణమాసమునకు పేరగునపుడు॥ పు।

నిభ - ఇది - వ్యాజమునకు పేరగునపుడు॥ పు। ఉపమానవాచకమైనపుడు॥ త్రి॥

ప్రభు - ఇది - సమర్థునకును ప్రభువునకు పేరగునపుడు విశేష్యలింగము.

విభు - పు॥ ఇది - నిత్యమైనదానికిని - పతికిని - అంతటనున్నదానికిని పేరు.

✻ భాంతపదములు ముగిసెను. ✻

ద్రుమమాస్త్వైద్యసుహృద్వృక్షే

ద్రుమ-పు॥ ఇది॥ శిశుపాలుని స్నేహితునకును- వృక్షమునకును పేరు.

భ్రమోమాభ్రాంత్యంబునిర్గ హే-౨౬౮।

భ్రమ-పు॥ఇది. భ్రాంతికిని-జలధారికిని పేరు.

సోమః కుబేరే కర్పూరే లతాభేదే నిశాకరే।

సోమ-పు॥ఇది-కుబేరునకును- పచ్చకర్పూరమునకును-సోమలతకును-చంద్రునకును పేరు.

గ్రామః పల్ల్యాం స్వరే బృందే త్వయం శబ్దాది పూర్వకః॥

గ్రామ-పు॥ఇది_పల్లెకును- సర్వమునకును పేరు-ఈ గ్రామశబ్దము సమూహవాచకమైనపుడు శబ్దము మొదలైన శబ్దపూర్వకమైయుండును- ఉదాహరణము- శబ్దగ్రామః- భూతగ్రామః-గుణగ్రామః ఇత్యాదులు-

స్మరాభిలాషయోః కామోఽనుజ్ఞాయాం కామమవ్యయమ్।

కామ-పు॥ఇది-మన్మథునకును- కోరికకును పేరు-అనుజ్ఞకు పేరయినపుడు- కామమ్ అనియవ్యయము.

శక్తావాచరణవిక్షేపే పరిపాట్యామపి క్రమః॥౨౬౯॥

క్రమ-పు॥ఇది-సామర్థ్యమునకును-నడుపునకును స్వాధ్యాయక్రమమునకును పేరు.

ఆత్మా యత్నే ధృతిస్స్వాంతే స్వభావపరమాత్మసు। జీవబుద్ధిశరీరేషు

ఆత్మన్-పు॥ఇది- యత్నమునకును-ధైర్యమునకును మనస్సునకును-స్వభావమునకును-పరమాత్మకును-జీవునికిని బుద్ధికిని శరీరమునకును పేరు,

రశ్మిస్తు ప్రగ్రహే ద్యుతౌ

రశ్మి-పు॥ఇది-పగ్గమునకును-కాంతికిని పేరు.

శ్యామాకాదౌ ద్రుమే గర్ముత్

గర్ముత్-స్త్రీ॥ఇది_చేమలు-ఊదలు- మొదలయినతృణధాన్యములకును-వృక్షములకును పేరు.

క్రిమిస్స్యాత్కీటలాక్షయోః।

క్రిమి-పు॥ఇది-పురుగునకును_లక్కకును పేరు.

గ్రీష్మోష్మబాష్పేషూష్మాణ

ఊష్మన్-పు॥ఇది-గ్రీష్మకాలమునకును- వేడిమికిని-కన్నీటికిని పేరు.

ఊమో వ్యోమని పత్తనే।

ఊమ-పు॥ఇది-ఆకాశమునకును-పత్తనమునకును పే

సామవేదే సామ్ని

సామన్-న॥ఇది-సామవేదమునకును- మంచిమాటలాడుటకును పేరు.

దమో దండే చేంద్రియనిగ్రహే।

దమ-పు॥ఇది_శిక్షకును-ఇంద్రియనిగ్రహమునకును పేరు.

గుల్మస్త్వంస్త్రీ ప్లీహ్ని ఘటే భేగసైన్యవిశేషయోః।

గుల్మ-పు॥ ఇది- చెట్టుమొదలుకొనికొమ్మవరకుగల భాగమునకును_రొమ్మునసెడమ ప్రక్కనుండుపచ్చనిమాంసవిశేషమునకును కడవకును_గుల్మవ్యాధికిని-సేనాభేదమునకును పేరు.

క్ష్మ్యామస్స్యామా జలే చంద్రే

క్ష్మ్యామ- న్యామ-పు॥ ఈ రెండును ఉదకమునకును- (చంద్రునకును పేరు.

యమస్తు యమళేఽంతకే।శరీరసాధనాపేక్ష నిత్యకర్మణి సంయమే।౨౭౦।

యమ-పు॥ఇది- అమడలకును_యమునికిని-శరీరమాత్రమును సాధనముగాన పేక్షించుచు నిత్యముగా చేయదగిన [illegible] పేరు.

ఉమాస్యాదతసీగౌరీహ
రిద్రాకీర్తికాంతిషు।
సీమసీమేఽమే క్షేత్రే కూల
మర్యాదయోరపి॥ ౨౬౩॥

ఉమా-స్త్రీ॥ఇది-నల్లగసిచెట్టునకును-గౌరికిని-పసపునకును-కీర్తికిని-కాంతికిని పేరు-

సీమన్-సీమా-స్త్రీ। ఈ క్షేత్రమునకును-నద్యాదుల యొక్క-గట్టునకును-పొలిమేరకును పేరు.

బ్రాహ్మీ సుబ్రహ్మశక్తిస్స్యా ద్
స్వర్ణాత్సాఽప్యథ భారతీచ సా।
లక్ష్మీస్సంపద్రమా శోభా

బ్రాహ్మీ-స్త్రీ॥ఇది-బ్రహ్మశక్తికిని-పొన్నగంటిచెట్టునకును-సరస్వతికిని పేరు.

లక్ష్మీ-స్త్రీ॥ఇది-సంపత్తునకును-లక్ష్మీదేవికిని-కాంతికిని పేరు.

జామిస్స్వస్రు కులస్త్రియోః।
రుమాసుగ్రీవ భార్యాయాం
సైవస్యాల్లవణాకరే।
సూక్ష్మః ప్రాంతేషుసూ
త్రాదేః కింజల్కేనేత్రలోమ
సు॥ ౨౬౪॥

జామి-స్త్రీ॥ఇది-తోడబుట్టినదానికిని-కులస్త్రీకిని పేరు

రుమా-స్త్రీ॥ఇది-సుగ్రీవునిభార్యకును-ఉప్పుసముద్రమునకును-పేరు.

సూక్ష్మ॥పు॥ఇది-దారము మొదలయినవానియొక్క-కొనలకును-ఆకరువువ్వులకును-కనుఱెప్పమీద రోమములకును పేరు.

పక్ష్మన్-న॥ఇది-పాయిరంధ్రమునకును-చకారమువలన ఱెప్పకును పేరు.

లక్ష్మన్-న॥ఇది-చిహ్నమునకును-శ్రేష్ఠునకును పేరు

పల్లి గంధేఽపిచపక్ష్మస్యా
ల్లక్ష్మచిహ్నప్రధానయోః।
ధామరశ్మ్యప్రభావస్థానప్రభా
వసుఖసద్మసు॥ ౨౬౫-

ధామన్-న॥ఇది-పుట్టుకకును-కాంతికిని-ఉనికిపట్టునకును ప్రభావమునకును-సుఖమునకును- గృహమునకును పేరు.

కర్మవ్యాసే క్రియాయాం
చవర్త్మనేత్రచ్ఛదాధ్వనోః।
హేమ్ని రేతసి భర్మస్యాచ్ఛ
ద్మసద్మని కైతవే।

కర్మన్-న॥ఇది-వ్యాసునికిని-క్రియకును పేరు.

వర్త్మన్-న॥ఇది-కనుఱెప్పకును-మార్గమునకును పే

భర్మ-ఇది-బంగారమునకును-రేతస్సుకును పేరు.

ఛద్మన్-న॥ఇది-గృహమునకును-కపటమునకును-పేరు.

తమోరాహౌగుణేధ్వాం
తేశోకే
వ్యోమనభోంబునోః।

తమస్-న॥ఇది-రాహువునకును-తమోగుణమునకును-చీకటికిని-శోకమునకును పేరు.

వ్యోమన్-న॥ఇది-ఆకాశమునకును-ఉదకమునకును పేరు.

రామః పశౌజామదగ్న్యే
బలరాఘవయోశ్చ నా॥
సితాసితమనోజ్ఞేషుత్రిషు
రామాతుభామినీ
శ్యామాషోడశవర్షాస్త్రీ
త్రివృత్తాశారిభాసిశా॥ నీలీ
ప్రియంగుష్ణేషుపుంస్యయం
తద్వత్త్రిషు।

రామ పు॥ఇది-పశువునకును-పరశురామునకును-బలరామునకును-శ్రీరామునకును పేరు, ఈశబ్దము తెలుపునకును-నలుపునకును-సుందరమైనదానికిని పేరైనపుడు-త్రి.

రామా-స్త్రీ॥ఇది-స్త్రీకి పేరు.

శ్యామా-ఇది-పదునారుసంవత్సరములవయస్సుగల స్త్రీకిని-తెల్లతెగడకును-సుగంధపాలకును-రాత్రికిని పేరైనపుడు-స్త్రీ-నీలిచెట్టునకును-ప్రేంకణపుచెట్టునకును-నలుపునకును పేరైనపుడు-పు-అనలుపుగలదానికిని పేరైనపుడు-త్రి॥

క్షమా క్షాన్త్యాం, తితిక్షా యాం యోగ్యే శక్తహితేషు తు॥ ౭౮॥ త్రిష్వ

క్షమా-ఇది-ఓర్పునకును పేరయినపుడు-స్త్రీ-యోగ్యునికిని-సమర్థునికిని-హితునికిని పేరయినపుడు-త్రి.

క్షేమమస్త్రీ స్యాత్సంగతే రక్షణే-

క్షేమ-స్న॥ ఇది-శుభమునకును-సంపాదించినదానిని రక్షించుటకును పేరు.

ముతునామస్త్రీ ప్యపక్వే స్యామే శ్యామం త్రణేవ్యయమ్॥ ౭౯॥

ఆమ-ఇది-బుజువై నదానికిని పేరయినపుడు-పు-అపక్వమయిన దానికిని పేరయినపుడు-త్రి-సంబోధనమైనపుడవ్యయము.

భీషణే త్రిషు భీష్మస్సాన్ శ్రీపుత్రగాంగేయయోస్తునా॥

భీష్మ-ఇది-భయంకరమైన దానికి పేరయినపుడు-త్రి శివునికిని-భీష్మాచార్యుని పేరగునపుడు-పు.

క్షౌమం సంగమే చానాల్పే

క్షౌమ-ఇది-తెల్ల వస్త్రమునకు పేరగునపుడు-న-అల్పమునకును పేరగునపుడు-స్న.

భీమశ్శంభౌ వృకోదరే॥ ౮౦॥ మోరేత్రిష్వ

భీమ-ఇది-శివునకును-భీమునికిని పేరగునపుడు-పు-భయంకరమయినదానికి పేరగునపుడు-త్రి.

థధర్మోస్త్రీ పుణ్యసామాన్యభావయోః । చాపన్యాయోర్ధ్వరాహింసా యజ్వాచారయమేషు నా॥ ౮౧॥

ధర్మ-ఇది-పుణ్యమునకును-సామాన్యమునకును-నత్తకును పేరయినపుడు-స్న-ధనుస్సునకును-న్యాయమునకును-యాగమునకును-హింసింపకుండుటకును-సోమయాజికిని-ఆచారమునకును-యమునికిని పేరగునపుడు-పు.

హిమస్త్రీ తే త్రిషుక్లీ బే ప్రాలేయే చందనేపి చ।

హిమ-ఇది-చలికి పేరయినపుడు. త్రి-మంచునకును గంధమునకును-పేరయినపుడు-న.

తోక్మం క్లీ బే కర్ణే మరే హరితే త్రిషు త్రిలింగకః॥ ౮౨॥ హరిద్యవేనా

తోక్మ-ఇది-గులిమికి పేరయినపుడు-న-పచ్చనిదానికి పేరగునపుడు-త్రి-పచ్చయవలకు పేరయినపుడు-పు.

ప్రేమాతునస్త్రీయాం స్నేహనర్మణోః।

ప్రేమన్-స్న-ఇది-స్నేహమునకును-క్రీడకును పేరు.

వామావధ్వాంసవ్యరమ్య ప్రతీపేష్వేష చాచ్యవత్॥

వామా-ఇది-స్త్రీకి పేరగునపుడు-స్త్రీ. ఎడమప్రక్కకును-సుందరమయినదానికిని-ప్రతికూలమయినదానికిని పేరగునపుడు విశేష్యలింగము.

వామీస్సృగాలీబడబా రాసభీకరభీష్వ

వామీ-స్త్రీ॥ ఇది-స్త్రీజాతులయిన నక్క-గుఱ్ఱము-గాడిదె-ఒంటె వీనికి పేరు.

థ॥ క్రమాత్సంఖ్యాహ స్తిబిందోర్వ్రిధి వ్యూహాంత రాహిషు॥ ౮౩॥ అబ్జేఘాల్గే త్రియోః పద్మః క్లీ బే పుంస్య త్రియాం॥

పద్మ-ఇది-సంఖ్యకును ఏనుగుశిబ్బెమునకును పేరైనపుడు-న-నిధికిని-పద్మవ్యూహమునకును-సర్పమునకును పేరయినపుడు-పు-కమలమునకు పేరగునపుడు-స్న-ఛారంగికిని-లక్ష్మికిని పేరయినపుడు-స్త్రీ.

పర్మన్ నస్త్రీ శుభాకారే ప్రమాణనపుష్టోరపి॥ ౮౪॥

పర్మన్-స్న-ఇది-శుభమయిన యాకారమునకును ప్రమాణమునకును-శరీరమునకు పేరు.

సమా త్రీ నత్సరేసాధున

సమా-ఇది-సంవత్సరమునకు పేరగునపుడు-స్త్రీ-సజ్జను

ర్వతుల్యేషుతుత్రిషు।

ఊర్మిర్ద్వయోస్స్యాద్దు త్యంతావస్త్ర సంకోచరే ఖికా॥ ౨౫౯॥ తరంగశ్చా

థ నేమిస్త్రీస్న చక్రాంతేభి త్తిమూలకే - కూపత్రికా యాంనాత్వేవ భవేత్తినిశ పాదపే॥౨౬౦॥

పరమాత్మాతపో వేదో బ్రహ్మా బ్రహ్మాబ్జజేద్విజే। ఋత్విజ్యు

థకుజేద్రైత్యేభౌమోనాథ భూర్భవేత్రిషు।౨౬౦॥

శ్రీమాన్ తిలకవృక్షేపి

ధీమాన్ వాచస్పతావపి।

స్వామీస్కందేస్య

థో జాల్మస్త్వథైనాలోచ్య కారిణి॥౨౬౧॥ నిర్బుద్ధావపి జిహ్మస్తుమందేవక్రే పృథ్భౌత్రిషు।

ఇతిమాంతాః.

చయస్సమూహే ప్రాకారే మూలబంధేచసంగ్రహే।

న యోనితౌ ద్యూతభేదే తార్క్ష్యస్స్యాద్గరుడేరథే।

కలినక్షత్రయో స్తిష్యః

స్యాద్వ్యయః కాలఘూక

యోః॥ ౨౬౨॥

మన్యుః క్రోధక్రతౌదైన్యే

నికిపేరయినప్పుడును- సర్వనామవాచకమయినపుడును-తు ల్యవాచకమయినపుడు-త్రి.

ఊర్మి-స్త్రీ-ఇది-అత్యంతాశక్తికిని- వస్త్రపుకుచ్చి ళ్ళకును-అలకునును-చకారమువలన పరంపరకును పేరు.

నేమి-ఇది--బండియంచునకును- గోడయడుగునకు ను-బావియంచునకును పేరయినపుడు-స్త్రీ-నెంమిచెట్టునకుపే రయినపుడు-పు॥

బ్రహ్మ-ఇది-పరమాత్మకును-తపస్సునకును-వేదము నకును పేరగునపుడు-న బ్రహ్మదేవునికిని- బ్రాహ్మణునికిని ఋత్విజునకును పేరయినపుడు-పు.

భౌమ-ఇది-అంగారకునకును- నరకాసురునకును పే రయినపుడు- పు- భూమియందుబుట్టినదానికి పేరగునపు త్రి.

శ్రీమత్ పు-ఇది-తిలకవృక్షమునకును-అపిశబ్దమువ లన శ్రీమంతునికి పేరు.

ధీమత్-పు॥ఇది-బృహస్పతికిని- అపిశబ్దమువలనబుద్ధి మంతునికిని-పండితునకును పేరు.

స్వామిన్-పు॥ఇది కుమారస్వామికిని- అపిశబ్దమువ లననేలెడువానికిని-ధనికునికి పేరు.

జాల్మ-పు॥ఇది-జడునకును- ఆలోచనసేయకకార్య ము జేయువానికిని-బుద్ధిహీనునికిని పేరు.

జిహ్మ-త్రి॥ఇది-మందునికిని-వక్రమైనదానికిని పేరు.

ఉభౌ-ఈజాల్మజిహ్మశబ్దములు-ను- త్రిషు-త్రిలింగ ములయందును వర్తించును.

—* మాంతపదవర్గము ముగిసెను. *—

చయ-పు।ఇది-సమూహమునకును- ప్రాకారమున కును-సంసారబంధమునకును-సంగ్రహించుటకును పేరు.

నయ-పు॥ఇది-నీతికిని ద్యూతవిశేషమునకును పేరు.

తార్క్ష్య-పు॥ఇది-గుఱ్ఱమునకును-గరుడునకును-ర థమునకును పేరు.

తిష్య పు।ఇది-కలియుగమునకును-పుష్యనక్షత్రము నకును పేరు.

వ్యయ-పు॥ఇది-యమునికిని-గుడ్లగూబకును పేరు.

మన్యు-పు॥ఇది-కోపమునకును- యాగమునకును- దైన్యమునకును పేరు.

దస్యుః ప్రత్యర్థి చోరయోః।
క్షయో రోగే గృహే తత్పే
కల్పాంతే గృహే పచయే పృథ
నాశే సంశ్లేషణే తౌర్యత్రి
కసామ్యేభ వేల్లయః।
దాయో ధనే విభక్త పి
తృద్రవ్యే వయౌతకే। ౨౯౫

దస్యు-పు॥ఇది-విరోధికిని-దొంగకును పేరు.

క్షయ-పు॥ఇది-రోగభేదమునకును కల్పాంతమునకును-గృహమునకును. నాశమునకును పేరు.

లయ-పు॥ఇది-నాశమునకును- ఆలింగమునకును-నృత్తగీతవాద్యములసామ్యమునకును పేరు,

దాయ-పు॥ఇది-ధనమునకు- విభాగించుకొనదగినపితృద్రవ్యమునకు-వివాహకాలమునందునల్లునికిమామయిచ్చువస్తువులకును పేరు.

ప్రాయో వయో మృత్యు
తుల్య బాహుళ్యానశనేషు
నా। ప్రాయోవ్యయంచబా
హుళ్యే
స్యాదర్యస్స్వామివైశ్య
యోః। ౨౯౬॥

ప్రాయ-పు।ఇది-వయస్సునకును-మృత్యువునకునుసమానముగుటకును- బాహుళ్యమునకును - అనశనవ్రతమునకును పేరు- ఈప్రాయశబ్దము బాహుళ్యార్థకమైనపుడవ్యయముంగలదు.

అర్య పు॥ఇది-ప్రభువునకును-వైశ్యునికిని పేరు.

కక్ష్యా కచ్ఛే వరత్రాయాం
కాంచ్యాం గేహ ప్రకోష్ఠకే।

కక్ష్యా-స్త్రీ॥ఇది-కచ్ఛకును-ఏనుగునడుమనగట్టుతోలుమోకునకును- మొలనూలికిని- యింట్లతొట్టికట్టునకును పేరు.

సంధ్యా సంధౌ పితృప్రస్వాం
ప్రతిజ్ఞాసీమయోరపి। ౨౯౭
ఛాయా కాంతిస్సూర్య
జాయా ప్రతిబింబమనాతపః
త్రయీ త్రివేద్యాం త్రితయే

సంధ్యా-స్త్రీ॥ఇది-సంధికిని- సాయంకాలమునకును-ప్రతిజ్ఞకును-ఎల్లకును పేరు.

ఛాయా-స్త్రీ॥ఇది-కాంతికిని- సూర్యునిభార్యకును-ప్రతిబింబమునకును-నీడకును పేరు-

త్రయీ-స్త్రీ॥ఇది- వేదత్రయమునకును-మూడింటికిని పేరు.

ప్రవ్రజ్యా వర్గే సతామపి॥

ప్రవ్రజ్యా-స్త్రీ॥ఇది- సజ్జనులసమూహమునకు-ఆపిశబ్దమువలన భిక్షార్థమయి పలుమారుదిరుగుటకును పేరు,

క్రియాతు చేష్టాకరణసం
ప్రధారణకర్మసు। శిక్షారం
భోపాయపూజా చికిత్సాని
ష్కృతిష్వపి॥ ౨౯౮॥

క్రియా-స్త్రీ॥ఇది బుద్ధిపూర్వకవ్యాపారమునకును వ్యవహారమునందు నిశ్చయము బుట్టించు లిఖితసాక్ష్యాదులకును-వ్యాపారమునకును-శిక్షకును-ఉద్యోగమునకును- ఉపాయమునకును-పూజకును-చికిత్సకును- ప్రాయశ్చిత్తమునకును-అపిశబ్దమువలన ధాత్వర్థమునకును పేరు.

శబ్దగుంభే పిశయ్యాస్యా

శయ్యా-స్త్రీ॥ఇది-శబ్దములగూర్చుటకును-అపిశబ్దమువలన పాన్పునకును పేరు.

త్కన్యా రాశ్యంతరేపిచ।

కన్యా-స్త్రీ।ఇది-రాశిభేదమునకును- అపిశబ్దమువలన ఋతువుగానిపడుచునకును పేరు.

వీర్యం పరాక్రమే శుక్రే
ద్రవ్యం విత్తే గుణాశ్రయే

వీర్య-న॥ఇది-పరాక్రమమునకును-రేతస్సునకును పే

ద్రవ్య-న।ఇది-ధనమునకును-రూపాదిగుణములకాశ్రయమయినవస్తువులకును పేరు.

గుహ్యం రహస్యోపస్థ

గుహ్య-త్రి-రహస్యమునకును జననేంద్రియమునకును-త్రి-స్త్రీ-పు.

పయః పానీయదుగ్ధయోః।
పయః పక్షిణిబాల్యాదౌ
వత్సరేయావనేపి చ॥ ౩౦౧
మాల్యంపుష్పే పుష్పదా
మ్ని
మూల్యంవేతనవస్త్రయోః
చైత్యమాయతనే బుద్ధేడిం
భేచోద్దేశపాదపే॥ ౩౦౨॥

కాంస్యం వాద్యం తరే
పానపాత్రేతైజనవస్తుని।
నాట్యంతౌర్యత్రికేనృత్తే

ప్యాజ్యంస్త్రీవానసర్పిషోః॥
శ్లోకేపద్యం స్త్రియాం
మార్గే
కావ్యం గ్రంథేకవౌపు
మాన్।
గవ్యాత్తావపిగవ్యాస్నా
న్నద్వయోర్దేవ్యవాయ
యోః॥ ౩౦౪॥
రూప్యంస్యాదాహతస్వ
ర్ణరజతేతద్విభూషణే। సు
రూపేత్రిషు
పూజ్యస్తుత్రిష్వర్ఘ్యశ్వశు
రేపుమాన్-౩౦౫॥
స్వాత్త్రధ్యేశపథేసత్యం
లోకేనాత్రిష్వృతాన్వితే।

యయుర్నాశ్వేశ్వమేధీయే
దీర్ఘాయుష్యాం త్వయంస్త్రి
యాం॥ ౩౦౬॥
ఋషిణీర్థవేశాయంకా
యోదేహసమూహయోః।
కుదేవతాస్త్రిష్వేవ

ఋషులగుహ్యావయవములకు పేరయినపుడు-న- చకారమువ
లనదాపేటికిని పేరు.

పయస్-న-ఇది-ఉదకమునకును-పాలకును పేరు.

వయస్-న॥ఇది-పక్షికిని-బాల్యము మొదలయినవయ
స్సులకును-సంవత్సరమునకును-యావనమునకును పేరు.

మాల్య-న॥ఇది-పుష్పమునకును- పుష్పహారమునకు
ను పేరు.

మూల్య-న॥ఇది-కూలికిని-వస్త్రమునకును పేరు.

చైత్య-న॥ఇది-యజ్ఞశాలకును- పక్షాంతరమునబౌ
ద్ధాలయమునకును- బుద్ధదేవునకును- శివునకును. రచ్చమ్రా
నికిని పేరు.

కాంస్య-న॥ఇది-వాద్యభేదమునకును. పానపాత్రమునకు
ను-లోహవస్తువునకును పేరు.

నాట్య-న॥ఇది-నృత్తగీతవాద్యములకుమూటికిని-నృ
త్తమునకును పేరు.

ఆజ్య-న॥ఇది-సరళదేవదారుబంకకును- నేతికి పేరు.

పద్య-ఇది-శ్లోకమునకు పేరయినపుడు-న- మార్గ
మునకు పేరయినపుడు-స్త్రీ.

కావ్య-ఇది- గ్రంథమునకు పేరగునపుడు-న- శుక్రు
నకు పేరగునపుడు-పు.

గవ్యా-ఇది-రెండుక్రోసులదూరమునకును- ఆపిశబ్దమువ
లనగోసమూహమునకును పేరగునపుడు స్త్రీ-గోవులపాలుపె
రుగు మొదలైనద్రవ్యములకును-ధార్యకును పేరగునపుడు-న

రూప్య-ఇది-కరిగిపోసినబంగారునకును- వెండికిని-
ఆవెండిసొమ్మునకును పేరగునపుడు-న- అందమయినదానికి
పేరగునపుడు-త్రి.

పూజ్యఇది-పూజ్యునకి పేరగునపుడు-త్రి-కన్యనిచ్చిన
మామకు పేరగునపుడు-పు.

సత్య-ఇది-యథార్థమునకును- శపథమునకును పే
రయినపుడు-న-సత్యలోకమునకు పేరయినపుడు-పు- సత్య
వంతునికి పేరగునపుడు-త్రి.

యయు-ఇది- అశ్వమేధయాగమునకుదగినగుఱ్ఱము
నకు పేరగునపుడు-పు- పొడవైనకఱ్ఱకు పేరైనపుడు స్త్రీ.

కాయ-ఇది-చిటికెనవ్రేలుదర్భవ్రేళ్ళనడుమనిడువన
లయు ఋషిసంబంధమైనతీర్థమునకు పేరగునపుడు- న-
దేహమునకును-సమూహమునకును పేరయినపుడు-న్న- కు
... గునపుడు- త్రి.

జయ స్తువిజయే పుమా౯
౩౦౮। జయాతు పథ్యాత
ర్కారీతిథిభేదఉమాసఖీ।
వన్యావన సమూహేస్యా
ద్వన్యంత్రిషువనోద్భవే।
ఏకత్వాదౌవిచారేచసం
ఖ్యాసంఖ్యంతుసంయుగే।

జయ-ఇది- జయమునకుపేరగునపుడు-పు- కరక చె
ట్టునకును-తక్కిలిచెట్టునకును-జయతిథికిని-పార్వతీదేవిచెలి
కత్తెకునుపేరగునపుడు స్త్రీ.

వన్యా-ఇది- వనసమూహమునకుపేరగునపుడు-స్త్రీ-
వనమునబుట్టినవానికిపేరగునపుడు-త్రి.

సంఖ్య-ఇది-ఒకటిమొదలయినలెక్కకును ప్రమాణ
ముచేతనర్థముపరీక్షించుటకునుపేరగునపుడు-స్త్రీ-యు
ద్ధమునకుపేరగునపుడు-న.

ఆస్త్రీమధ్యంసమేన్యాయ్యే
ప్యవకాశావలగ్నయోః।
త్రిషుసాధ్యంసాధనీయే
నామయోగేగణదైవతే।
హృద్యంహృదోప్రియేహృ
జ్జేహృత్ప్రియేచ త్రిలింగక
మ్। ౩౧౦ ॥ వశ్యకృద్వేద
మంత్రేతుహృద్యో హృద్యం
విలేపనే।

మధ్య-మ్న-ఇది-సమభాగమునకును- న్యాయముగల
దానికిని-మధ్యప్రదేశమునకును-నడుమునకును-పేరు.

సాధ్య-ఇది-సాధింపదగినదానికిపేరగునపుడు-త్రి- సా
ధ్యనామయోగమునకును-గణదేవతకునుపేరగునపుడు- పు

హృద్య ఇది హృదయమునకిష్టమైనదానికిని- హృదయ
మునబుట్టినదానికిని - మనస్సునకుసంతోషకరమైనదానికిని
పేరగునపుడు-త్రి- వశ్యకరమైనవేదమంత్రమునకుపేరగున
పుడు-పు-గంధాదిలేపనద్రవ్యమునకుపేరయినపుడు-న.

సౌమ్యః పుమా౯బుధేవి
ప్రేత్రిషుస్యాత్సోమదైవతే
౩౧౧॥ సమ్యేనుగ్రేచ
జన్యంతురథ్యా కలహాయు
ద్ధయోః। జన్యామాతాపితా
జన్యస్త్రిషు తూత్పాద్యనీచ
యోః। ౩౧౨॥ జ్ఞాతౌభృ
త్యాంజనవోఢాయాంజన్యా
స్త్రీష్వథావరన్యయే।
అశ్లీలేసురతేగ్రామ్యంగ్రా
మ్యఃపల్లిభవేజనే॥౩౧౩॥

సౌమ్య-ఇది-బుధునికిని- బ్రాహ్మణునికినిపేరగునపు
డు-పు-సోముదేవతాకమయినహవిస్సుకునకును- రమ్య
మైనదానికిని-ఉగ్రముకానిదానికినిపేరయినపుడు-త్రి.

జన్య-ఇది-వీథిజగడమునకును-యుద్ధమునకునుపేరై
నపుడు- స్త్రీ-తల్లికిపేరైనపుడు-స్త్రీ తండ్రికిపేరయినపుడు- పు
పుట్టింపదగినవానికిని-నీచునికినిపేరగునపుడు- త్రి-జాతికిని-
క్రొత్తపెండ్లికూతునకును. పెండ్లికొడుకుయొక్కచెలికాం
డ్రకును పేరగునపుడు-పు.

గ్రామ్య-ఇది-పామరజనవాక్యమునకును- సురతము
నకునుపేరగునపుడు-న- పల్లెయందుబుట్టినజనులకుపేరయి
నపుడు-పు.

రథ్యారథాంగే విశిఖేర
థ్యస్తురథవోఢరి।

రథ్యా-ఇది-రథసమూహమునకు గ్రామమునందు-
ప్రధానమయినరచ్చమిట్టకును పేరగునపుడు-స్త్రీ- రథమును
ఈడ్చుగుఱ్ఱమును మొదలయినవానికిపేరగునపుడు-పు.

హరీతక్యాంతుపథ్యాస్యా
ద్ధితేపథ్యంత్రిలింగకమ్।
కర్మానుబోధకే గృహ్యమ
యంస్వపక్షేత్రిషుగృహ్యం
శాఖాపురంగృహ్యాగృహాస
క్తామృగాఃఖగాః॥ ౩౧౪॥

పథ్యా-ఇది- కరకచెట్టునకుపేరగునపుడు-స్త్రీ- శరీర
మునకుహితమయినదానికిపేరయినపుడు-త్రి.

గృహ్యా-ఇది- కర్మబోధకగ్రంథమునకుపేరైనపుడు
ని-పక్షమునకుపేరయినపుడు-త్రి-రాజధానికన్న వేరుగాసమీ
పమునగట్టబడియున్న పట్టణమునకుపేరయినపుడు-న- ఇం
డ్లయందుమృగములకును పక్షులకును పేరగునపుడు-పు.

సహ్యోఽద్రౌ సహ్యమారో
గ్యం సోఢవ్యే త్వేష వాచ్యవ
త్।
యోగ్యం క్లీబే పూపయాన
చందనాభ్యాసవాచకమ్।
ప్రవీణోపాయవచ్ఛక్తయో
గాహేష్వప్యయం త్రిషు।
ధర్మాంబుపుష్పస్వర్ణేషు
పుణ్యం ధర్మవతి త్రిషు।

త్రిషు చోద్యం చోనాశ్చర్యే క్లీ
బే తు ప్రశ్నచిత్రయోః।
ధిష్ణ్యః శుక్రానలౌ ధిష్ణ్య
మృక్షే స్థానే గృహే బలే।

భవ్యం సత్యే శుభే క్లీబం త్రి
షు స్యాద్యోగ్యభావినోః।

సేవ్యం త్రిలింగం సేవార్హే క్లీ
బే తు స్యాదుశీరకే॥ ౩౧౯॥
ఇభ్యా కరేణ్వాం త్రిష్వాఢ్యే
భృత్యో దాసే భృతే స్త్రి
యాం.
కృత్రిమాల్పనదీ కుల్యా ప్ర
ణాళ్యాం చ కులోద్భవే। కుల్య
స్త్రీ ప్వస్థి కుల్యం స్యా
దథ కల్యమహర్ముఖే। కల్యా
కల్యాణవాచస్యాత్త్రిషు నీ
రోగదక్షయోః॥ ౩౨౦॥
శల్యం వంశశలాకాయాం
శస్త్రే తోమర యోరపి। శల్యః
కశ్చిన్మహీపాలశ్శ్వావిన్మద
నపాదపః। ౩౩౧।
ఆస్యం వక్త్రే వక్త్రభిలే క్లీ
బే న క్త్రభవే త్రిషు।
అశ్వమధ్యం సురాకశ్యక
శ్యస్త్రీ ష్వకశాహకే।

సహ్య-ఇది-పర్వతమునకు పేరగునపుడు-పు ఆరో
గ్యమునకు పేరయినపుడు-న-సహింపదగినదానికి పేరగున
పుడు.వి శేష్యలింగము.

యోగ్య-ఇది-భక్ష్యమునకును వాహనమునకును-
చందనమునకును- అభ్యాసమునకును పేరయినపుడు-న-నే
ర్పరికిని-ఉపాయవంతునకును। సమర్థునకును-యోగాభ్యాస
మునకుదగినవానికిని పేరగునపుడు-త్రి.

పుణ్య ఇది- ధర్మమునకును- ఉదకమునకును-పుష్ప
మునకును-బంగారునకును పేరగునపుడు- న-ధర్మవంతుని
కి పేరగునపుడు-త్రి.

చోద్య-ఇది-ప్రేరేపింపదగినదానికి పేరయినపుడు-
త్రి-ప్రశ్నకును-ఆశ్చర్యమునకును పేరయినపుడు-న.

ధిష్ణ్య-ఇది-శుక్రునకును-అగ్నికిని పేరగునపుడు-పు
నక్షత్రమునకును-స్థానమునకును-గృహమునకును- బలమున
కును పేరయినపుడు-న.

భవ్య-ఇది-సత్యమునకును- శుభమునకును పేరగున
పుడు న-యోగ్యమయినదానికిని- ముందుకలుగబోవుదాని
కిని పేరయినపుడు-త్రి.

సేవ్య-ఇది- సేవింపదగినదానికి పేరైనపుడు-త్రి-వట్టి
వేరునకు పేరయినపుడు-న.

ఇభ్య-ఇది-స్త్రీ-గజమునకు పేరైనపుడు-స్త్రీ-ధనవంతు(నికి పేరయినపుడు-త్రి.)

భృత్య-ఇది-దాసునికి పేరయినపుడు పు- కూలికి పేర
గునపుడు-స్త్రీ.

కుల్య-ఇది-త్రొవ్వబడిన కొంచెపు కాలువకును. జల
దారికిని పేరయినపుడు-స్త్రీ-సత్కులమున బుట్టినదానికి పేరగు
నపుడు-త్రి-ఎముకకు పేరగునపుడు-న.

కల్య-ఇది- ప్రాతఃకాలమునకు పేరగునపుడు-న-శు
భవాక్కునకు పేరగునపుడు-స్త్రీ-రోగహీనునికిని- నేర్పరికిని
పేరయినపుడు-త్రి.

శల్య-ఇది- వెదురుతూలికపుల్లకును- మేకునకును-
నేజాయను నాయుధమునకును పేరగునపుడు-న- శల్యు
డను రాజునకును-ఏదుపందికిని - మంగచెట్టునకును పేరగున
పుడు-పు.

ఆస్య-ఇది-ముఖమునకును- నోటికిని పేరగునపుడు-
న-ముఖమున బుట్టినదానికి పేరగునపుడు త్రి.

కశ్య ఇది-గుఱ్ఱము యొక్క నడుమునకును-కల్లునకు
ను పేరగునపుడు-న-అపరాధమువలన చబుకు దెబ్బ కుదగిన
[illegible]పుడు-త్రి.

దూష్యంపటగృహం దూష్యేకష్ట్యే నింద్యే త్వయం త్రిషు।

భూష్య-ఇది-గుడారమునకు పేరగునపుడు॥న॥ పీసుగునడుమునగట్టులోలు మోకునకు పేరగునపుడు॥స్త్రీ॥ నిందింపదగిన దానికి పేరగునపుడు॥త్రి॥

శరవ్యసంఖ్యా వ్యాజేషు లక్ష్యందృశ్యేత్వయం త్రిషు।

లక్ష్య- ఇది- గురికిని- లెక్క కును పెక్క లకును- పేరగునపుడు॥ న॥ అగుపడుదానికి పేరగునపుడు॥ త్రి॥

ఇజ్యాస్త్రీ యాగదానార్చాసంగేష్వజ్యో బృహస్పతౌ।

ఇజ్యా- ఇది- యాగమునకును- దానమునకును- పూజకును సంబంధమునకును పేరగునపుడు॥ స్త్రీ॥ బృహస్పతికి పేరగునపుడు॥ పు॥

గౌర్యామార్యాత్రిషుత్వేషఢలీనన్యాయ్యసాధుషు॥

ఆర్యా- ఇది- పార్వతికి పేరగునపుడు॥ స్త్రీ॥ సత్కులమునబుట్టినవానికిని- న్యాయముదెలిసినవానికిని- సజ్జనులకును పేరగునపుడు॥ త్రి॥

కృత్యంకార్యే దేవతాయాం కృత్యాస్త్రీకుపితేత్రిషు।

కృత్య-ఇది-కార్యమునకు పేరగునపుడు॥ స్త్రీ॥ కోపమునుబొందినవానికి పేరగునపుడు॥ త్రి॥

పునరర్థే వ్యయంభూయో భూయాన్ బహుతరేత్రిషు

భూయస్-ఇది-మరలననునర్థమున॥ ఆ॥ విస్తారమను నర్థమున॥ త్రి॥ భూయాన్॥ పు॥ భూయసీ॥ స్త్రీ॥ భూయస్॥ న॥

ఆద్యంఆదిభవేముఖ్యేభక్ష్యే చాపిత్రిలింగకమ్।

ఆద్య- త్రి॥ ఇది-మునుపుట్టినవానికిని-ముఖ్యునికిని-భక్ష్యవిశేషమునకును పేరు.

పూర్వేపాద్యావిధాత్రాద్యాఉత్తరేవాచ్యలింగకాః॥

ఆద్య- ఇది- బ్రహ్మమొదలైన పూర్వికులకు పేరగునపుడు॥ పు॥ ఈఆద్యశబ్దము ఉత్తరపదమైనపుడు విశేష్యలింగము. ఉదాహరణము- ఇంద్రాద్యాఃదేవాః॥ శచ్యాద్యాః స్త్రియఃఇత్యాదులు.

అర్ఘ్యోభవేదాత్మవతిప్రార్థనీయార్థయుక్తయోః।

అర్యః-పు॥ ఇది- బుద్ధిమంతునికిని- ప్రార్థింపదగినవానికిని- అర్థముతోగూడినవానికిని పేరు.

అర్ఘ్యోయల్లక్షైవార్ఘార్థే స్యాదర్ఘ్యో

అర్ఘ్యః-పు॥ ఇది-పూజార్థమైయుంచినదానికిని-పూజింపదగినదానికిని పేరు.

న్యోభిన్నతుల్యయోః॥

అన్య- పు॥ ఇది-వేరయినదానికిని- సమానమైనదానికిని పేరు.

వామదక్షిణయోస్సవ్య

సవ్య- స్త్రీ॥ ఇది-ఎడమప్రక్కకును- కుడిప్రక్కకును పేరు.

మంత్యోంత్యజ కనిష్ఠయోః।

అంత్య- పు॥ ఇది - అంత్యజాతికిని - కనిష్ఠునికిని పేరు.

సభ్యస్సామాజికేసాధౌ

సభ్యః॥పు॥ ఇది- సభాజనమునకును- సజ్జనునకును పే॥

జాత్యశ్శ్రేష్ఠకులీనయోః॥

జాత్య పు॥ ఇది- శ్రేష్ఠునకును-సత్కులమునబుట్టినవానికిని పేరు.

లభ్యోయుక్తేన్యాయలబ్ధవ్యా

లభ్య- పు॥ ఇది- న్యాయముతో గూడినదానికిని-పొందదగినదానికిని పేరు.

నిత్యాసతత శాశ్వతౌ।

నిత్య-పు॥ ఇది- ఎడతెగనిదానికిని-నాశములేనిదానికిని పేరు.

గర్హోపియా...

జ్యాయాంసో వృద్ధశస్తవ
రాగ్రజాః॥ ౩౩౦।

ఇతి యాంతాః.

కరోవర్షోపలే హస్తాంశు
డాయాంకిరణేబలౌ।
నరో మనుష్యార్జునయో
ర్భరోఽతిశయభారయోః॥
నాసావాయు ప్రాణిగవ
షడ్జోదాత్తాదయస్స్వరాః।
క్షురస్త్రుచ్ఛేదనద్రవ్యే గోక్షు
రే కోకిలాక్షకే॥ ౩౩౨॥
చారస్స్పశే ప్రియాళౌ చ

ఖురః కోలదళే శఫే।
వారస్సూర్యాదిదివసే బృం
దావసరయోరపి॥ ౩౩౩॥
భారో భరే వివధే చ పలా
నాం ద్విసహస్రకే।
క్షారస్తు లవణే కాచే రసభే
దే చ భస్మని॥ ౩౩౪॥
వృత్రో రిధ్వాంతదైత్యేషు

శక్రః కుటజవజ్రిణోః।
మంత్రో గూఢోక్తివే
దాంశౌ
యూపాంశే కులిశే స్వరుః॥

కారుశ్శిల్పి ర్విశ్వకర్మా
సురమారుతయోర్మరుత్
మరుర్ధన్వని శైలే చ
స్థాలీహవ్యాన్నయోశ్చ
రుః॥ ౩౩౬॥
అద్రిర్ద్రుమశైలార్కాః

స్యాదంఘ్రిః పాదబుధ్న
యోః।
ఐంద్రః కాకాసురే పివి। స్యా
జ్జయంతార్జునయోరపి

జ్యాయస్-పు॥ ఇది-వృద్ధునికిని- ప్రశస్తునికిని- శ్రేష్ఠునకును-అన్నకును పేరు.

—※ యాంతపదవర్గము ముగిసెను. ※—

కర-పు। ఇది- వడగండ్లకును-హస్తమునకును- ఏనుగుతొండమునకును- కల్పమునకును పేరు.

నర-పు। ఇది-మనుష్యునికిని- అర్జునునకును పేరు.

భర-పు॥ ఇది-అతిశయమునకును- భారమునకును పే।

స్వర-పు। ఇది-ముక్కునబుట్టునూపిరికిని-జంతువుల ధ్వనికిని- షడ్జాదిస్వరములకును- ఉదాత్తాదులకును పేరు.

క్షుర-పు। ఇది- పిల్లకత్తికిని-పల్లేరుచెట్టునకును-గొలిమిడిచెట్టునకును పేరు.

చార-పు। ఇది- వేగువానికిని- మొరిటచెట్టునకును పేరు.

ఖుర-పు॥ ఇది-రేగాకునకును-పశువులగొరిసెకును పేరు.

వార-పు। ఇది- భానుసోమాదివారములకును- సమూహమునకును- అవసరమునకును పేరు.

భార-పు॥ ఇది- బరువునకును- కావడికిని- ౨౦౦౦పలములయెత్తునకును పేరు.

క్షార-పు। ఇది-ఉప్పునకును- గాజునకును- రసవిశేషమునకును-భస్మమునకును పేరు.

వృత్ర-పు। ఇది-శత్రువునకును- చీకటికిని-వృత్రాసురునకును పేరు.

శక్ర-పు। ఇది-కొడిసెచెట్టునకును ఇంద్రునికిని పేరు.

మంత్ర-పు। ఇది-రహస్యాలోచనమునకును- గాయత్ర్యాదివేదమంత్రములకును పేరు.

స్వరు-పు। ఇది-యూపస్తంభఖండమునకును- వజ్రాయుధమునకును పేరు.

కారు-పు। ఇది-శిల్పికిని- విశ్వకర్మకును పేరు.

మరుత్-పు। ఇది- దేవతకును- వాయువునకును పేరు.

మరు-పు। ఇది-నిర్జలభూమికిని-పర్వతమునకును పే।

చరు-పు॥ ఇది- స్థాలీపాకముచేసినహవిస్సునకును-అన్నమునకును పేరు.

అద్రి-పు। ఇది-వృక్షమునకును- పర్వతమునకును సూర్యునికిని పేరు.

అంఘ్రి- పు- ఇది- పాదమునకును- చెట్టుమొదటికిని పేరు.

ఐంద్ర పు। ఇది-కాకాసురునకును జయంతునికిని- అర్జునునకును పేరు.

దంష్ట్రీ సదంష్ట్రే గ్రాహే హే హోనాసూకరేపి మూర్ఖ్ని కేకి హి।

దంష్ట్రిన్-పు॥ ఇది- లతాకారముగా చుట్టుకొని ప్రాణిహింసచేయు పెద్దమత్స్యమునకును- సర్పమునకును- పెద్దపులికిని- పందికొక్కునకును- అడవిపందికిని పేరు.

చక్రీవిష్ణౌ కులాలేపహౌ

చక్రిన్- పు-ఇది-విష్ణువునకును- కుమ్మరవానికిని సర్పమునకును పేరు.

పత్రీశ్యేనేషు పక్షిషు॥ స్యాత్సమ్రాడగ్నీంద్ర విష్ణర్కస్థా యిష్వస్యాన్మండలేశ్వరః। రాజసూయేనయే నేష్టం రాజ్ఞాశ్శాస్త్రాజ్ఞయాచయః॥

పత్రిన్-పు॥ ఇది- డేగకును- బాణమునకును- పక్షికిని పేరు.

సంమ్రాజ్-పు॥ఇది- అగ్నికిని-ఇంద్రునకును- విష్ణువునకును- సూర్యునికిని- మండలాధిపతికిని - రాజసూయయాగముచేసినవానికిని- ఆజ్ఞ తప్పక రాజ్యమునందలియితరరాజులశిక్షించురాజునకును పేరు- సమ్యక్ రాజతఇతిస మ్రా యిఇదిజకారాంతము-

ఇంద్రోవృషాశ్మశక్రార్కాః

ఇంద్ర-పు॥ఇది- ఇంద్రనీలమణికిని- ఇంద్రునికిని- సూర్యునికిని పేరు.

ఖరారుద్రాగ్నిగర్దభాః। పుండ్రో దేశేక్షు తిలకభేదే క్రిమ్యతిముక్తయోః॥ ౨౪౦॥

ఖర-పు॥ ఇది-రుద్రునికిని- అగ్నికిని- గాడిదెకును పేరు.

పుండ్ర-పు॥ ఇది- దేశభేదమునకును - చెఱకుమొక్కవిశేషమునకును- తిలకభేదమునకును - పురుగునకును- పువ్వులగురివిందకును పేరు.

ధారాపూః కాపిసేనాగ్రంప తదంబ్వాదిసంతతిః। ఖడ్గాదినిశిత ప్రాంతే తురంగగతి పంచకే॥ ౨౪౧॥

ధారా-స్త్రీ॥ ఇది- ధారానగరమునకును- సేనాముఖభాగమునకును- పడుచున్నయుదకాదిధారకును-ఖడ్గము మొదలైనయాయుధముల వాదరకును- గుఱ్ఱముయొక్క- అస్కందిత ధౌరితక రేచిత వల్గిత ప్లుతములను పంచధారలకును పేరు.

ఇరాసురాంబువాగ్భూషు

ఇరా- స్త్రీ॥ ఇది-కల్లునకును- ఉదకమునకును - వాక్కునకును-భూమికిని పేరు.

ఋతువత్సరయోశ్శరత్

శరత్ - స్త్రీ-ఇది- శరదృతువునకును-సంవత్సరమునకును పేరు.

ఉపమాతాచధాత్రీ సా త్క్ష్మామిరామలకీచసా॥

ధాత్రీ-స్త్రీ॥ ఇది-దాదికిని- భూమికిని- నెల్లిచెట్టునకును పేరు.

తరిర్దశాయాం నావిస్యా ద్వస్త్రాదీనాంచ పేటికే।

తరి- స్త్రీ॥ఇది- బద్దెకును- ఓడకును- వస్త్రాదులనుంచుపెట్టెకును పేరు.

తంద్రీతంద్రేత్యుభౌశబ్దా స్యాతాంనిద్రా ప్రమీలయోః

తంద్రీ*తంద్రా- స్త్రీ। ఈ రెండుశబ్దములును నిద్రకును ఒడలెరుంగకయుండుటకును పేరు.

వీరుధౌగుల్మగుల్మిన్యా

వీరుత్-స్త్రీ। ఇది- వేళ్లు మొదలుకొని యాకులుతరుచుగాగలచెట్టునకును- పొదలకును పేరు-కొమ్మలయందలియాకులయొక్క సమూహముతో గూడిన ద్రాక్షతాంబూలవల్ల్యాదులనియుం గొందఱందురు.

గిర్ణాస్త్రీనాచలేగిరిః।

గిరి- ఇది- మ్రింగుటకు చేరినపుడు స్త్రీ। పర్వతమునకు పేరు-పు॥

తత్రపూర్ద్వారిణి ప్లవేదర్వ్యాం
యాత్రాగత్యాంచ యాపనే॥ ౩౪౪॥
ద్వారంతుద్వార్యుపాయేచ
క్షీరంస్యాన్నీరదుగ్ధయోః।
అగ్రంపురశ్శిఖామానశ్రే
ష్ఠాధికఫలాదిషు। ౩౪౫॥

కృచ్ఛ్రంసాంతపనాదౌచ
కష్టేదుఃఖేనసోఽపి।
నభస్స్వర్గాంబుదేష్వభ్రి

ముగసీశ్రేష్ఠవక్షసీ॥ ౩౪౬
నగసీజలకాసారా
తరసీబలరంహసీ।

శిరఃప్రధానేసేనాగ్రే ద్రు
మాద్యగ్రేషుమస్తకే॥
గాత్రం ప్రతీకేదంత్యగ్ర
జంఘాభాగేవపుష్యపి।
పత్రంపర్ణేవాహనేచ-భూరి
కాగరుతోరపి॥ ౩౪౭॥
సీరసూకర వక్త్రాగ్రంపో
త్రం
పాత్రంతుభాజనే। తీరద్వ
యాంతరేయోగ్యే ద్రవిణే
రాజమంత్రిణి। ౩౪౮॥
సత్రంయజ్ఞేయజ్ఞ భేదేస
దాదానేపసంశుకే।

సూత్రంతుసూచన గ్రంథ
భేదేతంతువ్యవస్థయోః॥
నేత్రంవస్త్రే ప్రణ్లే వైశాఖ
గుణభూరుహమూలయోః।
క్షేత్రం భార్యాంగకేదార
పుణ్యభూగృహయోనిషు।
గ్రంథశాసనయోశ్శాస్త్రం

తత్రపూ-స్త్రీ॥ ఇది- దోనెకును-గరిటకును పేరు.

యాత్రా-స్త్రీ-ఇది-గమనమునకును- భోజనము మొదలగువర్తనలకును పేరు.

ద్వార- న॥ఇది-ద్వారమునకును- ఉపాయమునకును పేరు.

క్షీర- న॥ ఇది- ఉదకమునకును- పాలకును పేరు.

అగ్ర- న॥ఇది- ముందునకును-శిఖకును-మానమునకును- శ్రేష్ఠమునకును- అధిక ఫలమునకును- ఆదిశబ్దమువలన ౪ గాఁసముల ప్రమాణముగల భిక్షకును పేరు.

కృచ్ఛ్ర-ఇది-సాంతపనము మొదలైన వ్రతములకును-కష్టమునకును- దుఃఖమునకును- పాపమునకును పేరు.

అభ్రి-న॥ ఇది- ఆకాశమునకును- స్వర్గమునకును- మేఘమునకును పేరు.

ఉరస్-న॥ఇది-శ్రేష్ఠునకును-రొమ్మునకును పేరు.

సరస్- న॥ఇది-ఉదకమునకును- కొలనికిని పేరు.

తరస్-న॥ ఇది-ప్రధానమునకును- సేనాగ్రమునకును వృక్షము మొదలయినవానితుదకును-శిరస్సునకును పేరు.

శిరస్-న॥ఇది- ప్రధానమునకును-సేనాగ్రమునకును-వృక్షము మొదలయినవానితుదకును- శిరస్సునకును పేరు.

గాత్ర-న॥ఇది-ఒడలికిని- ఏనుగుయొక్క ముందుమోకాలికిక్రింది పక్కకును- ఆస్మేనుగుశరీరమునకును పేరు.

పత్ర-న॥ఇది- ఆకునకును-వాహనమునకును- పిట్లకత్తికిని- ఱెక్కలకును పేరు॥

పోత్ర-న॥ఇది- నాగేటి మొనకును- పందిమూతికిని పేరు.

పాత్ర-న॥ఇది- భోజనపాత్రమునకును- నద్యాదులయొక్క యిరుగడలనడిమికిని- యోగ్యునకును-ధనమునకును-రాజుయొక్క మంత్రికిని పేరు.

సత్ర-న॥ఇది-యజ్ఞ సామాన్యమునకును- సత్రయాగమునకును-ఎడతెగని యీవినివనమునకును-వస్త్రమునకును పేరు.

సూత్ర- న॥ఇది-అర్థగౌరవముగలసూచనరూపమైన గ్రంథవిశేషమునకును-దారమునకును- మర్యాదకును పే॥

నేత్ర- న॥ఇది-వస్త్రమునకును- నేత్రమునకును- కవ్వపుత్రాటికిని- చెట్లయొక్క మొదటికిని పేరు.

క్షేత్ర-న॥ఇది-భార్యకును-ఒడలికిని- మడికిని- పుణ్యభూమికిని-గృహమునకును- యోనికిని పేరు.

శాస్త్ర-న॥యిది- తర్కవ్యాకరణాది గ్రంథములకును-ఆజ్ఞకును పేరు.

